# బిల్వమంగళ

-శచంద్రఘోషుగారి వంగనాటకమునకు తెలుగు

గ్రంథకర్త

శ్రీపాద కామేశ్వరరావు

S981

— మొదటికూర్పు —

ప్రకాశకుడు

చెఱుకువాడ వేంకటరామయ్య

అభినవాంధ్రగ్రంథమాలాకార్యాలయము

రాజమండ్రి

---



జనేవరి 1927

వెల
మేలుప్రతి 1-4-0
సాదా ,, 1-0-0

# పీఠిక

భక్తుల చరిత్రము నాటకరూపమున రచించడము ప్రస్తుతమున ఆచారముగానుంది. లీలాశుకుడను భాగవతోత్తముని కథ మనభాషలో "చింతామణి" అనుపేర నాటకముగా రచింపబడి అంతటా వ్యాపించినది. దీనికిమూలము వంగభాషలో కీర్తిశేషులూ నాటకకవిశేఖరులు నగు గిరీశచంద్రఘోషుగారిచే కల్పింపబడినదని ఏరినదాని నాంధ్రలోకమున కర్పిస్తూన్నాము.

ఇది గద్యపద్య గీతాత్మకను. ఇందలి పద్యభాగము మాత్రనియమము మాత్రమే కలిగి ఆంగ్లభాషయందలి Blank Verse కు పోలియున్నందున మేము దానిని తెలిగించుటలో క్రొత్తత్రోవ త్రొక్కినాము. మన నాటకరంగస్థలమున ఎల్లెడ ననుమోదింపబడిన ఇతరకవులపాటలు కొన్ని చేర్చినాము. ఇందుకు మమ్ము క్షమింతురుగాక!

కథ పరమపావనము, రచనాపద్ధతి నూతనమవుటచేత ఈనుమము జనరంజకముగా నుంటుందని అపేక్షిస్తూన్నాము.

రాజమండ్రి
జనేవరి 1927

చెలకువాడ వేంకటరామయ్య
ప్రకాశకుడు.

## —కుశీలవగణము—

### పురుషులు.

| | | | |
|---|---|---|---|
| బిల్వమంగళుడు | ... | ... | కథానాయకుడు |
| సాధువు | ... | ... | దొంగసన్యాసి |
| బిచ్చగాడు | . | ... | |
| సోమగిరి | ... | ... | సన్యాసి |
| వర్తకుడు | ... | ... | |
| గోపాలబాలుడు | ... | ... | శ్రీకృష్ణుడు |

### స్త్రీలు

| | | | |
|---|---|---|---|
| చింతామణి | ... | ... | వేశ్య |
| దాసి | ... | ... | చింతామణినౌకరు |
| అహల్య | . | ... | వర్తకునిభార్య |
| పిచ్చిది | ... | ... | |

షరా—గ్రంథకర్త అనుమతిలేక దీని నెవ్వరూ ఆడకూడదు.

(భిక్షుకుడు పాడుతూ వచ్చును.)

తోడిరాగము—(వెడలెను కోదండపాణి వరుస)

వలపనెడు తుపానులోన-చెలగు జీవమను నావ।
కలగు హృదిని కల్లోలము-గాంచ గాంచ మించెనయ్యో॥వ॥
ఏడ ప్రాణములు చేర్చునో-ఎవ్వ డెరుగు దైవమాయ!
సుడివడు పెనుసుడిలోబడి-బడలిక మునుగ,
జడమురీతి జరుగుచుండ-జగమంతయు దిగులునొందు,
నడలులేక రాగలతిక-నందడించు చున్నదయ్యో ॥వల॥

బిల్వ—ప్రాణాలు నిల్చునట్లు లేదు.

బిచ్చ—బాబూ, దిక్కుమాలిన పక్షిని-ధర్మం చేసుకోరా!

బిల్వ—పోపో-నాప్రాణాలు తీయకు...ఏమిటాపాటా? సందడిస్తున్నాదా?

బిచ్చ—ఆకలిచేత పేగులు బిగబట్టుతూన్నవి.

బిల్వ—ఆపాట నాకు చెప్పు, వ్రాసుకొంటాను.

బిచ్చ—ఒక్కచోట నుండిపోతే కడుపు నిండుతుందా బాబూ? నాలుగువీధులూ తిరిగితే కదా నాలుగ్గింజలు దొరుకుతాయి.

బిల్వ—ఒకక్షణ మాగు-నీకేమైనా యిస్తానులే.

బిచ్చ—అంతమాటే చాలు-నాకేమీ వద్దు బాబూ!

బిల్వ—అలాగుకాదు-పాట వ్రాసుకొనిస్తే నీకు రూపాయి యిస్తాను.

బిచ్చ—నిజమే? నా తోడే?

బిల్వ—ఇదిగో ఇంద. (ఇవ్వబోవును)

బిచ్చ—నన్ను పోలీసువాళ్ళకప్పగించరు కదా?

బిల్వ—లేదు లేదు, పాటచెప్పు.

బిచ్చ—దీనిని నేను దొంగిలించలేదు, కృషిచేసి నేర్చుకొన్నాను.

బిల్వ—సరే, చెప్పు.

బిచ్చ—(పాడును)

బిల్వ—పాడవద్దు - మాటలు చెప్పు వ్రాసుకొంటాను.

బిచ్చ—వలపనెడి తుపానులోన...కల్లోలము.

బిల్వ—అబ్బో! వలపు మితిమీరిందే! అలాగు లేస్తూ వడుతూన్నవి-తరువాత?

బిచ్చ—ఏడ ప్రాణములు చేర్చునో-ఎవ్వడెరుగు దైవమాయ?

బిల్వ—ప్రేమ యెట్టి దనుకొన్నావు? నీ వెరుగుదువా?

బిచ్చ—(స్వ) ఈతనికి పిచ్చిపట్టింది కాబోలు?

బిల్వ—నీవు చెప్పలేవా? మెడ కురిపోసెదను మహా! మాటాడవేం? పాట చెప్పు...కానీ...

బిచ్చ—నడివడు పెనునడిలోబడి...

బిల్వ—ఉండుండు - నశిగుండవా? మాను వలయగనాటేవా?...

బిచ్చ—(పాట ముగించి) పాట సరి, బాబూ! ఇప్పించరా?

బిల్వ—ఆగాగు! నేను చూడనీ సరిగాఉందో లేదో.

బిచ్చ—చిత్రము.

బిల్వ—సందడిసూన్నదా?

బిచ్చ—బాబూ! రూపాయి యిప్పించరా?

బిల్వ—ఈపాట బాగులేదు.

బిచ్చ—ఏం బాబూ! అంగా సెలవిస్తారు?

బిల్వ—ఓరీ, నీ వెప్పుడైనా వలపులో పడినావా?

బిచ్చ—అదేమో నాకు తెలియదు గాని, ఒకసారి జెయిల్లో పడ్డాను-నా ప్రారబ్ధ మది-అప్పటినుండీ కల్లూ గంజాయి రోజూ తాగడ మ్మానేశాను. ఎప్పుడేనా దొరుకుతే పుచ్చుకొంటాను, లేకుంటే లేదు.

బిల్వ—నేను చెప్పినపని చేస్తావా?

బిచ్చ—బిచ్చ మెత్తుకోవాలి, పోతా సిప్పించండి.

బిల్వ—ఇస్తాను కాని, నేను చెప్పినట్లు చేస్తే ఇంకొక రూపాయి యిస్తాను...(స్వ) వీడి మూలాన దానిగుట్టు తెలుసుకోవలెను. దాని మనసులో ఆందోళనము పుట్టించవలెను... "అతడు వచ్చునని ఎంచుతూన్నావు కాబోలు-ఆయాశ నున్న సుమా!" అని కబురంపుతాను...ఓరీ, ఇటు విను-ఆయింటికి వెళ్ళు-చింతామణి అని ఒక ఆడ దగుపడుతుంది. అదేమి చేస్తున్నాదో చూచి దానితో "అతడు

వస్తాడని అనుకొంటున్నావు కాబోలు, ఇక రాడనుమా" అని చెప్పిరా.

బిచ్చ—అలాగే-ఏ యిల్లు?

బిల్వ—అదిగో పెద్దయిల్లు, కనబడుతూన్నదా? అది పళ్ళాకులా నుంటుంది...ఏలాగున్న నేమి? నాకు నచ్చింది... ఈపాట వినిపించు.

బిచ్చ—ఏ మనవలెను? ఆతడు వస్తాడనా?

బిల్వ—కాదుకాదు. ఆతడిక రాడని ..

బిచ్చ—తెలిసింది. నే నెరుగుదును-ఓ మహారాజా కోపమువచ్చినప్పుడెల్లా ఇట్లే కబురంపేవాడు.

బిల్వ—నే నీమఱ్ఱిచెట్టుక్రింద ఉంటాను. అన్ని విషయములు సవిస్తరముగా తెలుసుకొనిరా, ఎక్కడున్నాడో, ఏమి చేస్తూన్నదో చూడిరా. జాగ్రత్త - పాటమాత్రము వ్రాసియివ్వకు.

బిచ్చ—అబ్బో! అలాగు చేస్తానా? నే నెరుగుదును.

బిల్వ—అదే చూడు-ఒక మగవానివెంట ఒక ఆడది వస్తూన్నది, అది విడిచివచ్చిన యిల్లే. ఆ యింటివాని అది, ముందు దాని నడుగు, నాప్రసంగము వస్తే ఏమీ అనకు-నే నాచెట్టుక్రింద నుంటాను. (పోవును)

బిచ్చ—నాకు చేతకా దనుకొన్నారా? ఇష్టముంటే ఎట్టి కార్యమైనా చేయగలను (త్రోవలో నిలువబడును)

(సాధువు దాసియూ వత్తురు)

సాధు—ఇటు విను-ప్రేమానుబంధము పరిశీలించడములో నీవు మిన్నవు-నీహృదయ మెంత కోమలము! ప్రేమ అంటే సాధారణవిషయ మనుకొన్నావా? అది స్వర్గమంతా వ్యాపించి యున్నది, రాధాకృష్ణులు ప్రేయసులే సుమా!

దాసి—ప్రేమ ఎట్టిదో నాకు తెలియదు, నాకు నచ్చిన మగవాడు దొరకలేదు.

సాధు—నచ్చినవారని కొందరుందురా? వెర్రిదానా, నీవు వాళ్ళ నట్లు కావించవలెను. పురుషులు భృంగముల వంటివారు, ఈవిషయ మతిరహస్యము సుమా...ప్రేమ బైట పడగూడదు. చూడు-రాధ మేనత్త, కృష్ణుడు మేనల్లుడు; ఐనా, వారి రాసలీల ఎంత గుహ్యము!...నీ వేదో పనిమీద పోతూన్నట్లుంది. లేకుంటే ప్రేమనుగురించి ఇంకా వర్ణింపంగింతును. చెడుదారిలో పడ్డ నిన్ను మంచిదారిలోనికి తేవడమే నా ముఖ్యోద్దేశము.

దాసి—అలాగైతే సాయంత్ర మొకసారి దర్శన మిప్పించండి. నాకుకూడా మీ యుపదేశము వినా లనే వుంది. కడుపు జరుగక పోవడముచేతనే ఇట్లు నడుచుకుంటున్నాను అయ్యా! ఏమంటారు?

సాధు—ఏమి?

దాసి—నా యజమానురాలి దగ్గరకి పోయేటట్లున్నాను. ఆమె ప్రాపకాన్ని ఆమెంటా జగడము జరిగి ఆమెను బైట

వెడలి నాడు.

సాధు—సరే-నేను సాయంకాలము వస్తాను-ఇంట నింకెవ్వరినీ ఉండనీయకు-తలుపు మూడుసార్లు మెల్లగా తట్టుతాను. ఊరు మంచిది కాదు, ఎవరి కంటనైనా మనము పడితే ప్రమాదము.

దాసి—అలాగే-మరచిపోక వస్తారు కదా! (అతడు పోవును)

(బిచ్చగాడు ప్రవేశము)

బిచ్చ—నేను మీ యింటికే వస్తున్నాను.

దాసి—నీ వెవడవు?

బిచ్చ—ఇప్పుడు చెప్పను-త్వరగా ఇంటికి పద.

దాసి—చావు-ముండకొడుకా! నీ మొగాన నిప్పు పెట!

బిచ్చ—నాకే కాదు, నా పితాళ్ల కందరికీ అలా అయింది. నేను నీవలలో పడను, ముందు నీవు పద, వెనుక నేనుంటాను.

దాసి—ఓరి నీయిల్లు కూల! నీకు పిచ్చి పట్టిందా?

బిచ్చ—జాలము చేయకు, మాట చెప్పవలెను-అతడు చెట్టు క్రింద నున్నాడు.

దాసి—ఎవరు, మా అయ్యగారేనా? చెప్పు చెప్పు-ఎక్కడున్నారు?

బిచ్చ—ఊఁ! ఇక్కడ చెప్పుతా నమకొన్నావా? ఇంటికి పద.

దాసి—ఓరి చచ్చినోడా! నాతో వికటమా?

బిచ్చ—కాదు-ఒకమాట చెప్పవలెను-ఇంటికి పద చెప్పుతాను.

దాసి—చెప్పవా? మా అయ్యగారు [illegible]?

బిచ్చ—పోతే పడ్డారు, లేకపోతే లేదు-ఇంటికి పద. అక్కడ చూసుకుంటాము. కనబడిన వాళ్లందరితో చెప్పమందువా?

దాసి—(చింతామణిని చూచి) ఆశని వెదకాలనే కాబోలు-అదిగో-నా యజమానురాలు ఒకగడియ తాళలే కుంది. ఇల్లు వెడలి వచ్చింది-నేను మరచిపోయినా నన్నుకొన్నది కాబోలు.

బిచ్చ—అదే కాబోలు చింతామణి! ఇది తనయజమాను నా లంటున్నది, లోపలిమాట బయటికి రాకుండా కొంచె మాగుతాను.

(చింతామణి వచ్చును)

దాసి—ఏమమ్మా, కొంచెము శాంతించకూడదా? ఓపిక లేదా? ఇల్లు విడచి ఇప్పుడే రావలెనా? చూచేవా ళ్లే మందురు?

చింతా—అనుకోనీ, నే నోర్వలేను. స్నానానికి పోతూన్నాను.

దాసి—ఏడీ, ఆతడెక్కడా కనబడడే! గొప్పింటివాడు కదా? నీవు కొద్ది చేతలు చేస్తే సహించునా?

చింతా—నే నేమన్నాను! నీ వింట్లో లేవు-నేను భోజనము చేస్తున్నాను, ఇంతలోనే ఆలస్యమయింది. ఆపాటి దానికి రాత్రిఅంతా కొణకొణలే, మాటా లేదు, మంతీ లేదు. నన్ను నిద్రపోనివ్వ లేదు, తెల్లవారేదాకా సిద్ధూరాలే! ఒళ్ళుమండి నేను మాటాడలేదు-వెంటనే మేడదిగినాడు అతనికి నాకూ కోపము వచ్చింది-రెండు మూడుసార్లు తిరిగి వచ్చెను, కాని నేను పల్కరించలేదు.

బిచ్చ—అదిగో-ఆచెట్టుక్రింద నున్న యాతడేనా?

దాసి—ఎక్కడ?

బిచ్చ—(చింతామణితో) ఇదిగో విను-(దాసితో) నీవు కాదు. అతడు వచ్చు ననుకొంటున్నారు కాబోలు! అతడిక రాడు.

చింతా—ఎక్కడున్నాడు?

బిచ్చ—ముందు నీయింటికి పద-నీ వేమిచేస్తూన్నావో చూడవలెను, ఏలాగు భోజనము చేస్తావో గాంచవలెను, ఏమందువో వినవలెను; అప్పుడు మర్రిచెట్టుదరికి పోయి ఆ మాటలు చెప్పవలెను. అద్దరి నాతడున్నాడు-(బిల్వమంగళుడు పొదలో దూరును).

చింతా—దాసీ, చూడుచూడు-ఆపొదలో దాగుకొన్నాడే!

బిచ్చ— పాట

గౌరీమనోహరి రాగము-(బ్రోవసమయమిదే రామయ్యనమన)

సరసునకు దూరైనగా పొదలో-నగసుకు దూరైనగా పొదలో।

మరిమరివిన్ను మరపించుచుండె-

చేరివాని చెంత జేర్చుకొమ్మనీదు॥ సర॥

మనసులోని మా-టను దెల్పడాయె-

ధనములేమి చిన్నతనము నొందెనో ?

వనములోన జీ-వనమునల్పునే మెు

-కనుమువాడద్దరి-గొనజూచుచుండె ॥సర॥

బిల్వ—(స్వ) దానికి నాచింతేలేదు-నవ్వుతూన్నది-(ప్రకా) కట్టెలుకొనదాని కిట్లు వచ్చినాను- కంటపడ్డావు కావున ఒకమాట చెప్పెదను.

చింతలోననున్న చిరునవ్వు వెలయునా ?

విశ్వదాభిరామ వినుర వేమా.॥

చింతా—ఏమన్నావు? కర్ర లెందుకు? నీచితిపైన పేర్చుటకా ?

బిల్వ—నీ పుదార వనుకొంటిని కాని వట్టి తుచ్ఛ గాలవు సుమా!

చింతా—అబ్బో! నీవుదాకుడవా? నీవనులే తెల్పుతూన్నవి లే-ముంజేతి కంకణమ్మున కద్దమేల?

దాసి—అయ్యా, నామాట వినండి-మీరు గొప్పవారు గనుక ఈమె మాటలు పాటించకండి-చింతామణీ, నీవన్న

మాట బాగాలేదు సుమా!

బిల్వ...దాసీ, నీవేమీ చెప్పనక్కరలేదు-ఇక నేను రాను. నా దుఃఖమంతా నీ శోకనాదు తెల్పుతాను-నేను గొప్పయింటివాడను, గౌరవ మెచ్చులపొందిన నక్కడుంటాను. కనుపుల్లో లేసిది కౌగలించుకుంటే వస్తుందా!

చింతా—ఏమీ? నేను విన్నేమన్నాను? దాసి యింట్లో లేదు—నేను భోజనానికి కూర్చున్నాను, అందుకోసము తలుపు తీయడమునకు జాలమైంది, ఈపాటిదానికే నీ మనసులో కోపాన్ని రాత్రిఅంతా రగుల్చుతూనే ఉండనా? గౌరవ మెక్కువ కల్గిన నీ వక్కడికిపోదువా? నేనిదివరకే చెప్పినాను-బాగా ఆలోచించుకో.

దాసి—నా దొకమాట-ఆడవాళ్లిట్లు వీథిలో పడడము అన్యాయము.

చింతా—నీనెత్తి! నేను జలకమాడ వచ్చితిని-న న్నెందుకు నిందిస్తావు? ప్రొద్దుటనుండీ ఇక్కడ హాయిగా ఉన్నాడు. అతనికేమి? ఏమయినాడో అని నేను చస్తూ ఉన్నాను. ఒక మాటైనా కనిపించలేదు!

దాసి—అయ్యో! ఇ దన్యాయము కాదా? ఆడది, చిక్కిఉంది, ఆమెగతి "తానుండీ తనతల్లి గొడ్రా" లన్నట్లుంది.

బిల్వ—చింతామణీ, నిన్ను చూస్తే నాకు విచారముగా నున్నది.

చింతా—అయితే కోపముపడక తిన్నగా ఇంటికి వద.

బిల్వ—ఇష్టంను గాన. నేకు మాతండ్రి తద్దినము. వేళ మీరుతూన్నది.

చింతా—అయ్తైన ఆలస్య మెందుకు? కోపములేదని చెప్పి ఇంటికిపో.

బిల్వ—ఆం కోపమెందుకు?

చింతా—అలాగు కాదు- ఇటు విను. ఇప్పటికే పొద్దెక్కింది. "నాకుకోపములేదు" అని నీవనేదాకా నిన్ను పోనీయను.

బిల్వ—నాకు కోపము లేదు.

చింతా—సరే, ఇక నింటికి పో, నేను స్నానానికి పోతాను; త్వరగా ఏరు దాటు-సాయంకాలము వత్తువా?— కాదు, కాదు-నే డేరు దాటరాదు కదా?

బిల్వ—అయ్తైన నన్నెట్లు రమ్మంటావు?

చింతా—నేడొద్దు- రేపుదయము రా - రాకుంటే ఒట్టు సుమా!

బిల్వ—రేపేలాగు రాగలను?

చింతా—చూచినావా దాసీ నీ ఉదారుడు ! నేడు పోతున్నాడు, ఈ రాత్రి కంట పడడు, రేపుదయమైనా రా జాలడట!...కోపమే లేదట? కోపము నాకులేదు, ఉన్నమాట అన్నాను.

బిల్వ—ప్రొద్దుటే ఎట్లు రాగలను? కోపముతోనన్న

మాటా ఇది? పనిపాటు లుండవా?

చింతా—అదంతా నాకు తెలియదు, రేపు సాక్షంచే ఒట్టు వేస్తున్నావా—నన్ను చంపుకొన్నట్టే.

బిల్వ—అలాగే వస్తానులే.

చింతా—వస్తానంటే కాదు, రేపు మధ్యాహ్నము నాటికి నీ విక్కడికి రాకుంటే మీయింటికి నేనే వస్తాను.

బిల్వ—తప్పకుండా వస్తానని చెప్పితే మేలాగు?... (పోవును)

పిచ్చి—అమ్మా, కాపరమ్మా, నాకిస్తానన్న దేది? (పోవును)

దాసి—కోపము తగ్గిందని తెలిసీ ఇంటి కెందుకు తీసుకొని పోలేదూ?

చింతా—తండ్రిశ్రాద్ధము పెట్టుకోవద్దా! ఇంటికి కొని పోతే ఏలాగు?... ఈ రాత్రికి పీనిపీడ వదలింది... అబ్బబ్బా... నాకు కైదే కదా? కొంగు వదలడే, ఎటూ కదలనీయడు... రాత్రి అంతా గుసగుసలే! తలా లేదు తోకా లేదు... నిన్ను వలచినాను, నిన్ను వలచినాను, అని ఒకటే రోకలిపాట! వలచి నన్ను కొన్నాడా?... అదిగో చూడు, మళ్ళీ వస్తున్నాడు! (బిల్వమంగళుడు వచ్చును.)

బిల్వ—ఈ రాత్రి నేను రాను, నా బట్టలు జాగ్రత్త సుమా!

చింతా—విన్నావా దాసీ, బట్టలు వీధిలో పార

వేయుదునా?

బిల్వ—అంతటివాడవు కనుకనే చెప్పుతూన్నాను. (పోయి వచ్చి) మాపటింట, గొఱ్ఱెపిల్లలకు కందిగింజ శనగగింజ మేత పెట్టు (పోయివచ్చి) నీళ్ళిమ్మా, లేకుంటే గొంతు కొట్టుకొని పోతుంది.

చింతా—మేలా నీళ్లూ పెట్టవలెనేమి! గొంతుక పిసికి కోళ్ళకో పెట్టేసను, లేళ్ళా మెడనులిమి మింట నెగుర గొట్టేసను.

బిల్వ—అబ్బా! నీ వంకెదానవే! కనుకనే చెప్పుతూన్నాను. అవి మాటలాడితే ఆడనీ.

చింతా—నావస్తవు బాపడా, ఇంటికి పో-శ్రాద్ధము పెట్టవలె నంటివే! ఇంకెప్పుడు తింటావు? ప్రొద్దెక్కింది పోవయ్యా.

బిల్వ—ఇదిగో పోతున్నాను. (తిరిగివచ్చి) చెప్పమరచినాను, లేడిపిల్లకు గడ్డివేసి, కొమ్ము కర్రకి కొట్టుకోకుండా కట్టు, జోరావరిచేస్తే కోపగించకు, నేనుపోయివస్తాను.

చింతా—అనడమే కాని ఆచరణము లేదే! నాకు స్నానానికి వేళయింది. రేపునయము వత్తువా?

బిల్వ—చూదాము లే...

———

## —• రెండో రంగము •—

——

(బిచ్చగాడు, సాధువు)

బిచ్చ—సరేకాని ముందీమాట చెప్పండి, మీ రప రాధపరిశోధకులు కారుకదా?

సాధు— శివశివా! ఎంతమాట! నాపూర్వోత్తరము విను-నేను మొదట నవాబుకొలువులో నుంటిని, నాపేరు రామకుమారుడు. ఇది కలికాలము కదా? అధర్మభీతి గల వాని కాపదలు మెండు. నేను కొంతధనము దొంగిలించినా నని నాపై దావా తెచ్చినవెంటనే నాకు వైరాగ్య ముదయించి కాశికి పోగా, అక్కడ నాపూర్వభవపుణ్యవిశేషము వల్ల నాకొక గురువు లభించెను-అతడు సిద్ధుడు-పండ్రెండేండ్లు నన్ను తన సుతునివలె చూస్తూ నా కుపదేశించెను.

బిచ్చ—సొత్తు దొంగిలించినందుకు పోలీసువాళ్ళు పట్టుకోలేదా?

సాధు—శివశివా! నేనేమి? దొంగలాడడమేమి! ఎవరో కిట్టనివా ళ్ళీకింవదంతి పుట్టించినారు.

బిచ్చ—అయితే పోలీసువాళ్ళు మిమ్మేమీ చేయ లేదూ?

సాధు—"యతో ధర్మ స్తతో జయః", దైవకృపవల్ల ప్రమాద మేమీ ఘటిల్ల లేదు.

బిచ్చ—మీ రదృష్టవంతులు! నేను మరుగుదొడ్డిలో

దాగున్నా నన్ను బయటికి తీసినావు!

సాధు—నా గురువుగారి కృపవల్ల యోగశాస్త్రము, ధర్మశాస్త్రమూ, చికిత్సాశాస్త్రమూ మొదలయినవాటి నభ్యసించినాను. ఎప్పుడూ జగత్ క్షేమంకరములైన కార్యములే చేస్తూందును, నిన్ను శిష్యునిగా నొనర్చుకోవలెనని ఉన్నది; నీవు త్యాగివలె నున్నావు. నీచరిత మెట్టిదో వినవలెనని ఉంది, చెప్పుము.

బిచ్చ—మీరు రసగాధపరిశోధకులు గారని నాకు నమ్మకము ఇప్పటికి చిక్కింది. అందరి తలవ్రాతా ఒకతీరున నుండదు. నేను చిన్నప్పుడు మత్తువస్తువులు సేవించి యిల్లు గుల్లచేసి తుదకు కాలుపుజలేక బంగారుపూత పూసిన గిన్నె దొంగిలించి దానివల్ల ఒకమాసము హాయిగా గడిపినాను. నేనూ కాశీకిపోతూ ఒకపూజారి తలపైనున్న బంగారు వస్తువు దొంగిలించినాను.

సాధు—సరిపోయింది. నాకు తగిన శిష్యుడవే!

బిచ్చ—మీదయవల్ల ఎట్టి పనైనా పట్టుబట్టి సాధించగలను, కాని ఒక చిక్కుంది. నేనెక్కడ కనబడితే అక్కడ పట్టుకోమ్మని గవర్నమెంటువారి హుకుమ్ ఉంది.

సాధు—దానికొక ఉపాయ ముంది; జడలు ధరించి ఎఱ్ఱశాలువ గట్టి ఒళ్ళంతా విభూతి పూసుకుంటేసరి.

బిచ్చ—ఆవేషముతోనే నేను దొంగిలించినది. అందుచేత జడలు కత్తిరించవలసి వచ్చింది.

సాధు— నావద్దనుంటే నీకు భయముండ లేదు. అంత ర్ధానవిద్యచేత గన్న దాచగలను.

బిచ్చ—అందుకే మీ రదృష్టవంతు లన్నారు. పోలీసు వాళ్ళ కళ్ళు నూతన్నగాన్యాములు. నీట్లో దాగుకొన్నా జాడదీసి అవి దొంగని బైట కీడ్వగలవు.

సాధు—నాదగ్గర నుంటే నీకు భయ మనవసరము.

బిచ్చ—సరే-ఈ వినోద మెన్నాళ్ళో! ఇందు దొప గేమి?...అయ్యా, మీరు మాటలాడుతారా, లేక మౌన ముద్ర వహిస్తారా?

సాధు—యోగ్యులతో మాత్రమే మాటలాడడము.

బిచ్చ—జ్ఞానపత్రి సేవిస్తారా?

సాధు—అప్పుడప్పుడు మోతాదుగా.

బిచ్చ—మీ కష్టాంగసిద్ధి యైందా?

సాధు—అది పరమరహస్యము.

బిచ్చ—వచ్చినవా ళ్లందరినీ యాచితురా, లేక యిచ్చవచ్చిన వాళ్ళనే అడుగుదురా?

సాధు—హోమకుండము ముందుంటుంది-ఇష్టమున్న వా ళ్లేమైనా ఇచ్చెదరు.

బిచ్చ—సరే-మీ యాశ్రమ మెక్కడ?

సాధు—గుడిగాని గుండముకానీ చూసుకోవలెను.

బిచ్చ—సరే-వంతులు పంపక మేలాగు?

సాధు—నాకు కుటుంబ ముంది, వాళ్ళకి నెలకి పది

హేను సూపాయిలు పంపించవలెను. మాఅమ్మ, నాభార్య, ఇద్దరుపిల్లలూ ఉన్నారు. వాళ్ళఖర్చులు పోగా మిగిలినదానిలో నాకు పదివంతులు, తక్కినవి నీవి.

బిల్వ—మీకు సాధువుల మర్యాద తెలియనట్లుంది- శిష్యునికీ గురువుకూ భాగము సమానము కావలెను.

సాధు—దానికేమిలే-నీవు నాకు శిష్యుడవైన చాలు. నీకుతోచిన గురుదక్షిణ మాకర్పిస్తూ ఉండు.

బిల్వ—అదీ మేలైనమాట!

సాధు—నేటిరాత్రి చిన్నపని ఉంది.

బిల్వ—నాకుకూడా కొంచెము పనిఉంది.

సాధు—ఒకర్తె యింటికి నేను పోవలెను.

బిల్వ—నేనుకూడా ఒకచోటికి పోవలెను.

సాధు—అద్దరినా?

బిల్వ—మరేమీ?

సాధు—సరే-నేడే దానిని మరగించుకో

(పిచ్చిది పాడుతూ వచ్చును)

సింహేంద్రమధ్యమరాగము—(నతజనే పరిపాలయ-వరుస)

ఎటనుందువో-ఎరుగనునీ - విటురాగదే-మాఅమ్మ

కటకట పల్కరాదా నే-నిటుల మొరలనిడుచుబిల్వ ॥నెట॥

పోనీ నాయనను పిల్తునా? అబ్బబ్బా, ఎవరూ పల్కరు- పాపాణి తల్లి పాషాణమే కదా!—అమ్మా, అమ్మా-ఒక్క- సారి కంటపడవా?

సాధు—ఆహా! ఏమి మధుర గానము!

బిచ్చ—నీ వెవ ెవు? ఎటు పోతున్నావు?

పిచ్చి—నేనా—వెఱ్ఱినాని కూతురిని-పిచ్చిదానిని-

బిచ్చ—నీకు పెళ్ళి అయిందా?

పిచ్చి—ఆహా! పిచ్చివానికి నన్నిచ్చినారు! (పోవును)

సాధు—దీనిని పట్టకో-చక్కగా పాడుతుంది.

బిచ్చ—మనపని బాగానే సాగుతుంది.

సాధు—నీకు కూడా అష్టాంగసిద్ధి అలవడునే!

బిచ్చ—అలాగైతే నేనింకో శిష్యుని వెదకుకోవలెను-

— మూడో రంగము —

(బిల్వమంగళుడు శ్రాద్ధముపెట్టుచుండ పురోహితుడు మంత్రము చెప్పుచుండును)

బిల్వ—ఇదిగో మీకీ స్వయంపాకము పితృప్రీతికై ఇస్తున్నాను. సూర్యాస్తమయము కాబోతూన్నది, మీ మంత్రము ముగిసేటట్టు లేదు.

పురో—ఆలస్యము మీదే-మీవంటి యజమానులిద్దరు దొరికితే ఇక మా జరుగుబాటు కేమికొదవ? నిమంత్రితులైన బ్రాహ్మణులు ఉపవాసముచేత సుక్కినారు.

బిల్వ—నేను షడ్రసోపేతముగా భోజనము చేస్తినా?

పురో—మీరు వైదికకర్మల నిట్లాచరిస్తే మిమ్మల్ని వెలివేస్తారు.

బిల్వ—కోపపడకండి, లోనికి పోయి సమారాధన

సరిగా జరుగుతూన్నదో లేదో చూడండి. రామా!

(అతడు వచ్చును)

వడ్డన వాళ్ళు నిలు రమ్మను —(ఆతడుపోయి వచ్చి)

రాము—అయ్యా వడ్డనయింది-వడ్డన వాళ్ళు వస్తూన్నారు.

బిల్వ—స రే, నీవుపోయి అయిదు గిన్నెలలో అన్ని పదార్థములూ ఉంచుమను. అయ్యా-మీరు దయచేయండి- దేవతార్చనపెట్టెలోపలికి గొనిపొండి, రామా, నీవూ వెళ్ళు.

పురో—అబ్బో? ఇంత తెలివియున్నదా? (ఇద్దరూ పోదురు)

బిల్వ—అయిదు చాలువా? ఏదీ,— చింతామణి, దాసి--యిద్దరు-దాసి కోమునలమ్మ, చింతామణి కొకర్తె--- నాకొకటి- ఐదు—నే నక్కడే తింటాను—అబ్బా! పళ్ళి మూస మేఘావరణ మ్మునదే! గాలివాన వచ్చునేమో?. . .ఏమి యురుములు, ఏమి మెరుపులు! (రాముడు వచ్చును)

రాము—అయ్యా! బ్రాహ్మణులకు వడ్డించిన అన్నములో ధూళిపడ్డదని వాళ్ళు లేచిపోతా మంటున్నారు.

బిల్వ—దానికి నేనేమి చేయగలను?—ఐదు గిన్నెలూ సిద్ధమైనవా? వాటిని పడవల రేవుకి చేర్పించు-నేను దొడ్డిలోకి పోతానని మీద పెట్టి బయటికి దాటుతాను. నన్నుగురించి ఎవ రైనా అడుగుతే జ్వరము వచ్చిందని చెప్పు—వీ డెవడు? (గుమస్తా వచ్చును).

గుమా—బ్రాహ్మణులు భోజనము చేస్తూన్నారు, కుంభవృష్టి కురుస్తున్నది—రామూ, ఇక్కడెందుకున్నావు!

బిల్వ—వాని కిట పనిఉంది-నీవు లోనికిపోయి సమారాధన చూడు.

గుమా—సమారాధన వర్షముచేత నాగింది.

బిల్వ—సరే—నాకు నూరురూపాయిలు కావలెను, ఏలాగైనా జాగ్రత్తపెట్టు-తెలిసిందా?

గుమా—సామ్మెందీ? ఇల్లు తాకట్టు పెట్టవలెను.

బిల్వ—ఏలాగైనా సరే.

గుమా—నేను లోనికి పోతాను. కొంచె మాగండి.

బిల్వ—త్వరలో సొమ్ము జాగ్రత్తపెట్టు-లేకుంటే ఫలమనుభవిస్తావు సుమా!

గుమా—అలాగే-ఇక నీకొలువునకు నీళ్ళొదులుకోవలెను.

బిల్వ—ఏమి వాన! బయటపడకుంటే పనివ దొరకదు—ఎంత ఖర్చైనా అద్దరి చేరవలెను—(పోవును)

రాము—ఇదిగో తాళముచెవి, ఇక్కడే ఉంది. మరితే దీయనకు. నాకు జీతమురాళ్ళు ముట్టనే లేదు. సాధ్యమైనంత చేజిక్కించుకొనవలెను. విసిరినమ్మకి భాక్యందే కూలి.



## —। నాల్గో రంగము ।—

(శ్మశానములో నొక చితిపక్క నిప్పిడి కూర్చుండగా బిల్వ॥ వచ్చును.)

బిల్వ—ఇక్కడికి రెండుకోసుల దూరాన ఇంకో రేవుంది, అక్కడ పాలంవాళ్ళ పడవలో చిన్ననావలో ఉండక మానవు-అంతదూరము పోనక్కరలేకుండా ఇక్కడే తెప్పగాని, లేక దుంగగాని, దొరికితే బాగుండును. విడిచేతుల నీదడము కష్టము. ఈ చుట్టుపక్కల వెదకుతాను. అబ్బా! ఆకాశము చిల్లిపడ్డట్టు ముసలధారావృష్టి! ఇంద్రునికి కోపము వచ్చిందా కాబోలు?...నేను రాకపోతే తాను వస్తానంది, పాపము, అద్దరి నది నాకాలె నడుస్తూంటుంది...హా! ప్రాణేశ్వరీ! మనమిద్దరమూ చక్రవాకమిథునములాగు విరహావ్యథ ననుభవిస్తూన్నాము కదా? మసల ఈయేరు ఎడబాపుతూన్నది. ...ఈతువ్వచాటున వెలుగేమి? చితిమంట ఏమో? కాలమను నది కలకాలమూ పారుతూనే ఉండును. ఒకరికై కనిపెట్టుకొని యుండక దానిత్రోవ నది పోతూండును ..నా కాకలిచేత ప్రాణములు పోవునట్లున్నవి...తుపాను పట్టినట్లుంది. పిశాచములు పోరునట్లు మేఘములు గర్జించుతూన్నవి. ప్రాణమా, నీవు తుచ్ఛమని భావించియుందును గాని చింతామణి దర్శనమునకు వెలియాడును. కదా అని వెరచుతూన్నాను... ఏమి చేయుదును!...దాని ప్రాణాలూ ఇక్కడే ఉండును, కాని ఆడది, అబల-ఏమిచేయగలదు! లేకుంటే ఏరుదాటి నన్ను

బిగియార కౌగలించి పడిన్న విప్పుకొనులాడవా? చింతామణీ నాది, నేను దానివాడిని. నాప్రాణములు నాకు కావు-చింతామణివి దానికి నాపై నెంతప్రీతి!...ఏమి చేయడానికీ తోచదు, ఏరు దాటడ మేలాగు? ప్రవాహ మతితీవ్రముగా నున్నది. ఈశ్మశానములో ఏదైన కట్టె దొరికితే (ముందుపడిచి పిచ్చిదానిని చూచి) ఇదేమి భూతమా, పిశాచమా?... పిశాచమే! శవములను కాల్చుకొని తింటూన్నది. దీనిమనస్సు కరిగితే నన్నావలియొడ్డు చేర్చగలదు. నేను బ్రతికియున్నా నాప్రాణములు నిలుచుట లేవు. నీవు వెళ్ళిపోకితే చావుతప్పదు. కానీ, పల్కరించి చూస్తాను...ఓసీ! నిన్ను షోడశోపచారములతోను ఆరాధిస్తాను, అద్దరికి నన్ను చేర్చగలవా? తల్లీ! దయజూపి ధర్మము కట్టుకో-చింతామణికై నాచిత్తము తత్తర పడుతూన్నది.

పిచ్చి——ఏది ఏది చింతామణి? । ఎక్కడికి నేగినది?

మెడనున్న మణిహారము । వెడగువోలె కాటనుంటి,

ఆమె యెచటి కేగినదో? । అద్రిగుహాల జేరినదా?

అడవిలోని కేగినదా? । అక్కడనే నిల్చినదా?

ఏడ నాకు దోచదాయె । ఏల బ్రతుకువాస యింక?

దేశదేశములను తిరిగి । దేహమెల్ల బూడిదయలిమి,

కడుపుమంట నార్పగాను । కడునశించుచుంటి నేను;

పిడుగువడగ నురముచాచి । బిడియుడి హృదయమున దోచి,

అన్ని చోటులను జూచి । అన్నిదుఃఖముల దాచి,

వ్యాపయును తెల్లదనమంత । ఏవ నావలు వశి పిండ,
చిత్రకమలములకు పేలి । పాత్రయూరకు వవపాళి
రాదె సైకతశ్రోణి । ఏది? యేది? చింతామణి?

బిల్వ—(సవ్వి) ఇ దెవతె? చింతామణి నెందుకు పిలుస్తున్నావ్? ..ఇది భూతము కాదు, మానవగణములోనిదే? పిచ్చిదానివలెనుంది. నీవెవతెవు? చింతామణి నీ కేమవుతుంది?

పిచ్చి—చింతామణి నాది. పేరుపెట్టి పిలువకూడదు-హక్కు కాదా?

బిల్వ—అది ఆడదాని పేరు కాదా?

పిచ్చి—చింతామణియె నాదు । చిన్నారిచిలుక
ముక్తకేశిని అయ్యో! । ముద్దుల కిరవు
కలుముల ఇల్లాలు । కట్టదు బట్ట;
వరమిచ్చి వెతదీర్చు । వరశుభమూర్తి
సంతతంబును నామె । శవముపై నాడు;
రేపల్లెవాడలో । బ్రేవెలందులకు
వేణునాదము తాను । వినిపించు నెపుడు;
శిరమున జడలు నం । బరములే దిశలు
ఉండునొకప్పుడు । వెండిమల మీద
తాండవమాడుచు । తద్ధిమ్మియనుచు;
ప్రతిమయై ప్రేమయే । ప్రభవింప నోపు:
రాసకేళులలోన । రమియించు బాల,
ఉవిదలలోనెల్ల । యాదుపతి రాణి,

వనమాల ధరియించి । వలపులో జిక్కి,
వనమాలి వెతకుచు । వనిత తా గ్రుక్కు
పురుషుని ప్రకృతిని । పోషించుచుండు
విపరీతమగు రతి । వేడ్క దోపగను.
ఒక్కచో శవము వే । రొక్కచో చపల,
ఏకాకృతిగ నుండు । నె ద్దుజూచినను,
కాలంపునియమముల్ । గానరా వచట,
లేదు హిల్లోలంబు । లేదు కలకలము,
నిమ్నకు తొక్కిన । నీరంబువోలె
నిశ్చలంబై దోచు । నెచ్చట గనిన.
మానసము వాక్కును । గానంగ లేవు,
ఆది యంతము లేని । యతులస్వరూప,
రూపము న్నామము । రోయులే రెవరు,
గతమును భావియూ । గానంగ రావు,
అంతయు ప్రకృతంబు । వింత గొల్పెడును;
చింతామణియె నాదు । చిన్నారిచిల్క.

బిల్వ—నా చింతామణేనా? ఇన్నిదినాలనుండీ ఆమె రూపనీమను గాంచలేకున్నాను. అది మువాఙ్మనసగోచర! ఎట్లు చేరగలను? ఏమిచేయుదును? చింతామణీ, చింతామణీ, ఇక్కడే నాప్రాణాలు విడువవలసివచ్చునా ఏమి? దైవమా!

పిచ్చి—ప్రాణములు పోగలవా?... లేదులేదు-అవి పోవు-నీటిలో నురికినాను,-నీ రెండిపోయింది. అగ్నిలో వడ్డాను-

అగ్గిచల్లారింది...ఆహా! నామనోహారిణి ఎక్కడ నుందో? మన మిద్దరమూ చెరియొకచోటా వెదకుదాము రా. అమ్మా! అమ్మా! ఎక్కడున్నావు? ఇక్కడ అవతరించరాదా?

బిల్వ—నిబిడాంధకారము, దిక్కు తోచదాయెను! ప్రాణము పోజాలదన్న మాట నిజమే. అయ్యో! నాప్రాణము పోతే చింతామణిని చూడడ మేలాగు? మేఘగర్జనమా, నీకు జడియను. నదీతరంగములారా! మీ కోలాహలముకు వెరవను. దేహమా! నీయందలి మమకారము విడిచినాను. చింతామణిని గాంచగల్గుదునో లేదో అను సంశయము మాత్రముంది. అదిలేకున్న నీ వొక నదివా? పిల్లకాల్వ పాటి ఉండవు-సముద్రమైనా దాటడానికి సిద్ధము-చింతామణీ, చింతామణీ!

పిచ్చి—చింతామణీ! నిన్ను గనగోరడము వృథా. పిచ్చి దాననై ఇల్లు విడిచితిని-ఎంత వెదికినా కానరావు, ఎంతపిల్చినా పలుకవు-రాత్రి భయంకరమై యున్నది. అదిగో! నాపిచ్చివాడు! మొంగ మలాగే ఉంది. ప్రాణప్రియ చింతామణి ఒంటరిగా నుంది-నేను పోయెదను. ... ... ... (పోవును)

బిల్వ—నేనూ చింతామణిని గాంచెదను-చింతామణీ!

(నదిలో దుముకును)






# రెండో అంకము

## ఒకటో రంగము

(చింతామణియింటిలో సాధు బిచ్చగాడు)

సాధు—నీ కీయింటి వద్దనేనా పని?

బిచ్చ—ఔను-మాట యిచ్చినాను, దానిని మరతునా!

సాధు—పనేదో చెప్పు వింటాను.

బిచ్చ—చిన్న పనే. ఈయింటియజమాని తానిక్కడ లేనప్పు డిక్కడికి ఎవరెవరు వత్తురో చూడుమని నన్నుంచినారు. ద్వారము దగ్గర ఉంటిని, వర్షము కురుస్తూంటే లోనికి వచ్చినాను. స్త్రీ లితరుల వంచింపబోయి వారే వంచింపబడుదురు. నేను పరదేశినని కేక వేసినాను-అటుకులు, బెల్లము, పెరుగు, పెట్టినారు. నన్ను పోల్చినారేమో—"ఆమాడుమొంగమే వంపించియుండు" నన్నారు. ఇల్లు ఎవరో తుడుస్తూఉంటే జిల్లా కొట్టుతున్నదని కేకవేసితిని, ఈమూల నుండు మన్నారు. నీవు రాత్రి అంతా మేలుకొని యుంటి వెందుచేత?

సాధు—నీవిటునున్నావని తెలుస్తే కొంతమాటలు నే ర్పియుందును.

బిచ్చ—ఇప్పుడు నేర్పిన ప్రయోజనము లేదు-మేమెము లింకా విరియలేదు, మునుగుడన్ని మూడంకె వేసి నిద్రపోయెదను. శిష్యుడు చేయవలసినవని నే నెరుగుదును.

సాధు—దాసి యిటువస్తే నేనొక గొప్పసిద్ధుడ నని చెప్పు.

బిచ్చ—అలాగే-ఈదాసీతో వ్యవహారము సామాన్యముకాదు. నీమాట లిక్కడ సాగవు-అది కత్తికోతకత్తె. గురుశిష్యసంప్రదాయము చెల్లేటట్లులేదు. నీవు దానికి బోధించినది నేనెరుగుదును. రాధాకృష్ణనాటక మాడవలెనని నీయూహ-అది తెలిసినవాడను గనుక నీతో ఈ ప్రసంగ మెత్తినాను.

సాధు—నాశిష్యుడవని అను-అందు ప్రమాద మేమి?

బిచ్చ—నీవేషము గంభీరముగా నుందిగాని దానికి తగిన యోగ్యత నీకు లేదు. తెలివితక్కువ కాకుంటే తెల్లవారిన తరువాత గురుశిష్యధర్మ మెందుకు? నిశీథమున నిద్రయందున్నప్పుడు గురవేనమః యందును.

సాధు—నీవుపోయి వరుండు-నే నీదాసితో కొంత ముచ్చటించవలెను.

బిచ్చ—తెల్లవారిన పిమ్మట కూడదా? తత్పూర్వ మాహె దర్శనమే దుర్లభము. వట్టిమంచముపై వరుండిన

వసువుకత్తె పైకముచూపితే పసిగట్టివచ్చును గాని రూపాక్షు పేరుల చప్పుడు విని ఈవలకు వచ్చునా? పాలపాసితే గాని నీకు పైకమబ్బదు. అందుచేతనే కాబోలు పిచ్చిదానిని చేక్కించుకొనయత్నించినావు-అది కర్మకాలమునకు పారిపోయినది.

సాధు—వెర్రివాడా, నాకు కావు, నీకని నేను చెప్పలేదా?

బిచ్చ—హరిహరీ! ఇది నేనెరుగను-నీవు వగకాడవు గనుక పిచ్చిదానిపై నాసవిడిచి దాసికొరకై తల్లడిల్లుతూన్నావు. నాదగ్గిర దాచకు-ఆవులిస్తే పేగులు లెక్కపెట్టేవాడను సుమా! ఈదాసి ఆడదైనా నూరుగురు మగవాళ్లను చంపి పుట్టింది బాబూ! అదిగో బ్రహ్మరాక్షసిలాగు వస్తూన్నది-(పరుగెత్తును.)

(దాసివచ్చును)

దాసి—ఇద్దరు పెద్దమ్మలిక్కడ చేరినారూ? తాళము పగులగొట్టి లో, దూరలేదు కదా!...వీళ్లు దొంగలు కారు. ఓహో అయ్యగారు దయచేసినారా?

సాధు—వచ్చినాను.

దాసి—నేను మాయజమానిగారు రానందున యజమానురాలివద్ద నుండవలసి వచ్చింది. ఇక్కడికి రావడము మాట మనస్సులో పెట్టుకొనే ఉంటిని-చిన్న కునుకు పట్టింది. పాపము మిమ్ము కష్టపెట్టినాను, పొగాకైనా తేలేదు-పొద్దు పోయినప్పటినుంచీ యిక్కడనే ఉన్నాను. ఇంటికి పోలేదు-ఏమి చేయడానికీ తోచలేదు. దీపము వెలిగించి పొగాకు తెచ్చి అరుగు మీద కూర్చుండి మీయుపదేశము వింటాను... (పోబోవును)

బిచ్చ——చూచినావా దీని విశ్వాసము! తిరిగి వస్తా నండి-నీవు నన్నేరిగినట్లు నాకి తెలియనీయకు-ఇద్దరినీ గెంటి వేయుగలదు.

సాధు——పోగాకు కేమిలే-నీవుండు. నేను రామేశ్వ రము, హరిద్వారము, నాసిక, పూరి చుట్టివచ్చినాను గాని నాకు నచ్చినవా ళ్ళొక్కరు కనబడలేదు.

దాసి——ఆమాట నిజమే. అట్టివాళ్ళు దొరకడము అలభ్యయోగమే. నాకిప్పటికి ఇరువైయొక్క సంవత్సరములు గడచినవి. ఆ. చైత్రామాసానికి పందొమ్మిది నిండినవి, నాకూ అట్టివాళ్ళు లభించలేదు.

సాధు——నీవుమాత్రము నాకు చక్కగా నచ్చినావు.

దాసి——గట్టిగా మాటలాడకు. ఇక్కడో బికారి యున్నాడు, వాడిచెవిని మనమాటలు పడితే మనకిద్దరికీ పోన గడము కష్టము.

సాధు——నీకు రాధాప్రేమతత్వ ముపదేశించ వలె నని నా కోరిక.

దాసి——మంచిమాటే.

సాధు——సావధానముగా విను. ఈ సంసారసాగరము దాటవలెను.

దాసి——ఔను.

సాధు——దానికిముం దీవేశ్యావృత్తి మానవలెను, వెలయాలివై యుంట వెర్రికాదె?

దాసి—నాసంగతి నీవెరుగవు-పురుషుని చూడగానే గుణము పోల్చగలను. దేవతార్చనము చేయక నీరైనా తాగను. నాయం దనుగ్రహించి నాయింటికి వచ్చినవానిని నాథునిగా భావించి పరపురుషుని కన్నెత్తిచూడను. ఈరీతిగా ఇరువైరెండేళ్ళు ఒక్కరిపోషణమందే కాలక్షేపము చేసినాను.

సాధు—నాభావము నీకనగతము కాలేదు-నే నుంచు కోవడముమాట ఎత్తలేదు-ప్రేమవిషయము పల్కుతున్నాను.

దాసి—కావచ్చును. ఆడదానను గనుక విశదముగా చెప్పినకాని బోధపడదు.

సాధు—అట్లైతే - రెండుమాటలలో తెల్పుతాను. నేను నిన్ను రాధగా చూచుకొంటాను, నీవు నన్ను కృష్ణుని గా నెంచుకో. పిదప నీకిష్టమువచ్చినట్లు చేసినా పాపముం డదు ..రాధ వవుతావా?

దాసి—ఆమాట నాకు తెలియలేదు.

సాధు—రాసరసమయివై నా రాధవు కా, నీకు ప్రణ యకోపము వచ్చున, నీపాదములు పట్టి నే వలక తీర్చు తాను...నేను వేణుగానము చేసెదను, నీవు "ఏడీకృష్ణుడు? కృష్ణుడేడీ?" అని సొక్కిసొలసిసోలుతావు... తెలిసిందా?

దాసి—నీవు నన్ను పోషింపగల్గితే అన్ని ఆట లాడు తాను. కూటికీ గుడ్డకీ యిచ్చిన చాలును. పసుండడానికి పసుప క్కరలేదు,చాపైనానకే-నగలుపెట్టినా మానితా ఏమీఅనను.

సాధు—నేను బ్రహ్మచారిని, సామంతుడను కాను.

పికిలిగాంచు విద్యలు మాత్రమే ఎరుగుదును, భస్మాలు వేస్తాను, బంగారము చేయగలను.

దాసి—బంగారము చేయగలవా?

సాధు—శ్రీగురుకటాక్షమున ఆవిద్య నేను నేర్చగలిగితిని, నీ కుపదేశిస్తాను.

దాసి—అబ్బో! అలాగైతే నాబోటివాళ్ళను పది మందిని పోషించగలవు (స్వ) నన్ను బుట్టలో వేయవలెనని చూస్తున్నాడు!

సాధు—ఆవిద్య నేర్చుకొన్నాను, ఇంతవరకూ ఎప్పుడూ చేయలేదు; గురువుగారు "బైరాగికి బంగారు మెందుక"ని నిషేధించినారు. ఆవిద్య ఇతరుల కుపదేశించుమనే గుర్వాజ్ఞ. నీవు నా దానవైతే నీకు నేర్పుతాను. సంవత్సరము నా చెప్పు చేతలలో ఉంటే సకలవిద్యలూ ఉపదేశిస్తాను.

దాసి—(స్వ) సన్యాసికి సొత్తక్కరలేదు కాని సాని కావలెనట! వీడు టక్కరి లాగున్నాడు, ఇంటినుండి గెంటవలయును, లేకుంటే హాయిగా నిద్రపోనీయడు. (ప్ర) సరే, మీరు పొద్దుగుంకేసరికి రండి, నేను నిద్రపోవలెను. (బిచ్చగానితో) ఓరీ ముద్దా! నీవూ నడువు, నేను లోనికిపోవలెను, ఇద్దరూ దయచేయండి.

(గోడమీదనుండి బిల్వమంగళుడు దుముకును)

అయ్యోబాబో! దొంగరో! దొంగ! ఇల్లు దోపిడవును!

(లోపల, ఏమే, దాసీ, ఏమిటాగోల?)

రావమ్మా! దీపము తేవమ్మా! ఏదో మూల్గుతూ న్నట్లుంది.

(దీపము పట్టుకొని చింతామణి వచ్చును)

చింతా—ఏమిటే? ఏ మూలోల?

దాసి—(బిల్వ॥ చూపి) చూడమ్మా-అయ్యగారు!

చింతా—మాడుముఖము మళ్ళీవచ్చిందా? ఇక నన్ను కొరుక్కొని తింటాడు-అదేమి మూలుగుతున్నాడు?

దాసి—గోడమీదనుండి గెంతినాడు, దెబ్బ తగి లింది, ఇరుకు పట్టిందేమో?

చింతా—నామెడ కురిపోసినాడు-నాకేమి దిక్కు- దేవుడా?

బిల్వ—చింతామణీ-నీరు కొంచెము తే.

దాసి—బ్రతికి యున్నారమ్మా, భయము లేదు. జీవ ముంది.

చింతా—లేకుంటే నాప్రాణాలు తీయక మేలాగా?

దాసి—ఇటురా, చేతులుపట్టుకొని తీసుకొని పోదాము.

చింతా—ముందు లేవనెత్తి కూర్చోపెట్టు.

బిల్వ—దాసీ, నీవు నన్ను ముట్టకు, చింతామణీ! కౌగిలిచ్చి నన్నెత్తు.

చింతా—ఆఁ. దాసీ, ఎత్తవే-లే లెమ్మ, నేను రావాలా?

దాసి—అమ్మా! నీకు బుద్ధి ఉందా?

చింతా—ఓసి, నీవిన్నాళ్ళకున్నకూ! సంగతి గ్రహించలేకపోయినావు-నాయంత్రి మా మొన్నను పంపినాడు, నేనెవరికైనా సరసుని పెట్టుకొన్నానేమో స్వయముగా చూడవలెనని అర్ధరాత్రికి తానే దయచేసినాడు.

బిల్వ—చింతామణీ, నిజముగా నిన్నుచూడ వచ్చినాను సుమా.

చింతా—(ముక్కు మూసుకొని) అబ్బా! ఈ దుర్గంధమేమిటి? (ముగ్గురూ పోవుదురు)

బిచ్చ—చూచినావా? ఎంత మూర్ఖుడవో. సంతకి వన్నెజాజులు తెస్తారు, కాని చవిటినువ్వు తెస్తారా? ఇంకా ఆలోచనెందుకు? బయటికి పద, లేకుంటే చీపురుదెబ్బలు తప్పవు నేనూ వత్తునుకాని నాకింకా ఆశ పోలేదు. (దాసి వచ్చును)

దాసి—అబ్బే! అయ్యగారు ఒంటికేదో పూసుకొని రాలేదుకదా? ముక్కులో నరాలు కుళ్ళిపోతూన్నవి. శవము కంపు!

(చింతామణి వచ్చును)

చింతా—దాసీ, కుళ్లిన మాంసమే! పురుగులు గులగులలాడుతూన్నవి. పక్కంతా పాడైంది- ఇల్లంతా పాడుకంపు -ఎలాగు పోతుందో?

సాధు—దాసీమణీ, నేను పోనా?

చింతా—ఈశవ మెవడు? వీడినికూడా పంపినాడా?

దాసి—ఇంకా ఉన్నావా? ఒకసారి చెప్పితే వినబడ లేదా?

సాధు—రే పోకసారి కంటపడుతావా?

దాసి—ఇప్పుడు దయచేయుండి, రేపటిమాట ఆలో చింతాము. (సాధు పోవును)

బిచ్చు—ఏమమ్మో, యజమానురాలా, నేనుకూడా పోనా? నాకేమీ యివ్వరా?

చింతా—ఆఁ కొంచెముండు. ఏమి తల ఆడిస్తూ న్నావు? అతనివెంటా రాలేదు, నన్నుచూడ వచ్చినానంటు న్నావా; ఈజీవచ్ఛవ మెందుకు వచ్చినాడు?—ఇంత గాలి వానలో ఏ రీకత మేమి? శ్రాద్ధమూ లేదు గీర్ధమూ, లేదు. సర్వాబద్ధమే! పొద్దుయొద్దునే ఎక్కడో దాగియుండెను— గోడ దాటడమేమి? గట్టుగోడ నున్నగా ఉంది, దన్నూ లేదు దాపూ లేదు.

(బిల్వమంగళుడు వచ్చును)

బిల్వ—చింతామణీ, నీవు తాడు జారవిడువ లేదా?

చింతా—విన్నావా? దాసీ, ఎవరికోసమో గోడమీది నుండి తాడు జారవిడిచినా నట! చూచినావా గేలి?

బిల్వ—హాస్యము కాదు, నీతోడు. నిజముగానే తాడు పట్టుకొని ఎక్కినాను.

చింతా—దాసీ, నీవు నాకన్న పెద్దదానవు. నీతోను టనే చెప్పుతూన్నాను, ఇట్టిమాట లింక పడలేను. ఒక

హాపాయి నాన్నుంటే ఊరల్లా గోల! లేకుంటే మరిపింతలు. ఇల్లూ వాకిలీ తాకట్టు. నిచ్చెనవేసి గోడదాటి ఇంట్లో దూరడము! పైపెచ్చు మనస్సులో నాటే మాటలు!

బిల్వ—చింతామణీ-నిచ్చెనపైనే నెక్కలేదు, తాడు పట్టుకొనే ఎక్కినాను. నాదు సూపాయిలు జాగ్రత్తపెట్టుమని గుమస్తాతో చెప్పినాను, ఎల్లుండి యిస్తాను.

చింతా—ఏదీ, తాడు? చూపకుంటే చీపురు విరుగుతుంది.

బిల్వ—రా, చూపెదను.

చింతా—రా, దాసీ, చూచి వత్తాము. (పోవుదురు)

బిచ్చ—ఈనాడు గ్రహస్థితి బాగులేదు, రాత్రి కూలి పోయింది, నిద్రే లాభము-నన్ను వీళ్లు పాత్ర్యము వేయలేదు, బతికినాను. న్యాయాధిపతే విచారణకర్త! ఆమెమాట నిజమే, ఈరాత్రివేళ నది దాటడమేమిటి! అంతా గోల లాగుంది—ప్రేమ యిలాటిదే కాబోలు! దూరాన ఉండి అంతా చూస్తాను.

---

## — రెండో రంగము —

---

(గోడమీద పాము- బిల్వ॥, చింతా॥, దాసి, బిచ్చగాడు.)

బిల్వ—అదిగో చూడు, తాడు వేలాడుతూన్నది.

చింతా—ఏదీ? (గోడదగ్గరకు పోయి) అమ్మో!

యింటి ప్రాణనాథుని చూపించును, పాదాలను, తాకు త్రొక్కు మందము.

చింతా—నీకు మైమరుపు కలిగిందా? పిచ్చిపట్టిందా?

బిల్వ—నీకు ప్రేమమాహాత్మ్య మెంతైనా తెలియదు, కాని అతిసుందరివి! లోకమోహినివి!

చింతా—ఎప్ప నావైపు చూస్తూన్నా వేమి?

బిల్వ—నామాట నిజమానో కాదో చూస్తూన్నాను. నాకు మతిలేదని నీ విదివరకే గ్రహించియుండవలసినది. నీవు పాలయిగా నిద్రపోతూ ఉంటే నేను నీసుఖమే చూస్తూ ఉంటాను. నీ వూరివిడి వెడిచేటప్పుడు దశదిశలూ నాకు శూన్యములై తోచును. నీవు కంట నీరు పెట్టితే నాగుండెలో శూలము గుచ్చినట్లుండును. ఇది నీవెరుగవా? నాకు పిచ్చి పట్టకేమి? నాసర్వస్వమూ ఋణగ్రస్తమయింది, అది నేను లెక్క చేయలేదు నిందమాత్రమే నా కాభరణ మయింది. నామాటలన్నీ నిజమని ఇప్పుడైనా తెలిసిందా? (పామును చూచి) నాకు మతి లేదనడాని కిదే దృష్టాంతము. నేను వెఱ్ఱివాడనే కాని, చింతామణీ, నీవు అసమానసౌందర్యఖనివి! నిరుపమాన రూపసుందరివి!

చింతా—సరిపోయింది-ఏమంటివి?

బిల్వ—నీ వప్రతిమ మనోహారిణివి. లేకున్న ఇన్ని దినాలు నిన్ను పూజింతునా! నీవు దేవివా, రాక్షసివా అని వంశయిస్తూన్నాను. దేవివైతే నామనోవ్యథ నెరుగగల్గుదువు.

నీవు రాక్షసివే, కాని కమనీయగాత్రవు, కాంచనమూర్తివి.

చింతా — మురగపై ఈదినా నంటివే, ఏదీ దానిని చూపు.

బిల్వ — ఇంకా అపనమ్మకమే! రా, పోదాము.

---

—॥ మూడో రంగము ॥—

---

(నదీకూలము-శవము పడియుండును,
బిల్వ, చింతా, దాసియూ వత్తురు.)
(బాటసారులు పాడుతూ పోవుదురు)

మాయరా-జన్మము-మాయరా-పరికించిచూడగ ॥మా॥
మాయరా కాంచనము నాపిన-కాయ మిది క్షణభంగురంబని
హేయమని-సర్వభోగంబుల-రోయుటే భద్రమని తెలియర॥మా॥
కాలచక్రము నిల్వబోదుర-ఆంచబోవు గతించు నిముసము
కాంతలను కనకంబుపేరుము-కావు ముక్తికిసాధనములవి॥మా॥
సారము లేనట్టి సం-సారమునుచీకటిని నీకెట
దారితోచదు తెన్నుదోచదు-వారిజాక్షునిగొల్వకుండిన॥మా॥
వారకాంతల మోహవిభ్రమ-వాగురులలో చిక్కబోకుము
వారిహృదయము ప్రేమశూన్యము-వారిమాటలుబూటకములే॥

బిల్వ — నిజము-సర్వమూ మాయ! ఈవిపులబ్రహ్మాండమందు "నాది" అనదగిన దేదీ కానరాదు. ఎవర్తెకోసము వదిలో నర్ధరాత్రి ఉరికితినో ఆదే నాదికాదు! ఎక్కడైనా

ఏదేనా "నాథా" అనకపోవడ ఉన్నదేమో చూస్తాను.

చింతా—ఓహో! ఏమి యీ నదీకోలాహలము! సముద్రములాగు ఓగు పెట్టుతూన్నది, దేశమంతా ముంచేలాగుంది!...ఇందులో ఉరికినావా?... ఏమి తెగువ!...ఏదీ దుంగ? ఎక్కడ పెట్టినావు?

బిల్వ—అదిగో! (శవము చూపును)

చింతా—ఇదా? అబ్బే! కుళ్ళిన శవము!...నీమాటలన్నీ నిజము, నాకు నమ్మకము పుట్టింది...నీకు తప్పకుండా మతిపోయింది! రోత లేకపోయింది! సిగ్గూలేదు, లగ్గూలేదు; విషయము లేదు, భీతిలేదు-తాడనుకొని తాచుపాము పట్టుకొన్నావు, స్త్రీయని శవము కౌగలించినావు!...నే నిదివరలో ఒకమాట విన్నాను, నేటి కది నిజమయింది...నీచిత్తము వేశ్యనగు నామీద లగ్నముచేయక హరిపాదపద్మములందు ఏకాత్మ్యముగా లగ్నము చేసితివా, అది సార్థకమై యుండును. నిన్నేమందును? అర్థనిశీథమున ఘోరమైన తుపానులో నిండు నదిలో దుమికి, శవముపై ఈదుకొని వచ్చినావు! ఇది వినగానే ఒళ్ళు గగుర్పొడుస్తూన్నది. ఇంతేకాక పాము పట్టుకొని గోడ దాటినావు! ఇదంతా భ్రమ అనుకొన్నాను. ఇదే భ్రమ ఐతే ఇక భ్రమ ఎటువంటిది? ఏమి ధైర్యము! ఏమి తెగువ! ..నీచిత్తవృత్తి చూస్తే నాకేమీ పాలుపోలేదు.

బిల్వ—ఇంతే!

పురుషశరీరంబు- బుద్బుదము చూడ
        నీటను పెరుగును-నీటనే కుళ్లు
కుక్కలు నక్కలూ-కొఱికి పీకెదరు,
        అనలానభస్మమై-యనిలాన నెగయు,
ఇదె నాతి, దానికి-నీగతియె యబ్బ;
        సర్వసృష్టియు జూడ క్షణభంగురంబు.
అక్కటా!—ఎవరికై ప్రాణంబు లిడుచుంటి నేనె
        వ్వరికినై యీశోక-పరితాపనంబు?
కౌగిలించితి బిగ్గ-గాలి నే నయ్యయొ
        ఇది యువతియా? లేక ఇది ఛాయ యేమొ!
మిథ్య సమస్తంబు! మిథ్యయే! మిథ్య!
        నిబిడాంధకారంబు వీక్షించుచుంటి.
ఎవరివాడను నేను? ఎయ్యది నాది?
        ఇట్టి తాపము సైప-నేల నేనిట్లు?
ఛాయామహామాయ-సౌధసౌధముల
        తోచక నేనిట్లు-తోవ దొక్కితిని.
ఎవడొకో నావాడు? ఎయ్యది నాది?
        కానరా వదియేల? కడగి యెవ్వరైన
ఆర్చిన నాజ్వాల- నసువు లర్పింతు.
        హేయంబు సంసార-మిది చివుకుకర్ర!
అనుకొనుటకు ప్రేమ-కాధారమేది?
        ఏడ ప్రేమమహాబ్ధి-ఏడ దోచదుగ;

ప్రాణప్రవాహిని-పసుచోటు గాన.

బుట్టినదాదియు-పొడగాంచనైతి

నాత్మీయమనదగు-సత్త్వ మొక్కటియు.

ఏడబోవుదు నేను? నెయ్యెడ గాంతు?

గాఢాంధకారంబు-గనరాదు దారి

భవిజూపు నెవ్వాడు-ఛాయ విరియగను?

ఆత్మీయుడగువాని-నరయ బోవుదును

లోకమంతా తిరిగి-కేక వేయుచును.

(పిచ్చిది పాడుతూ వచ్చును)

(తోడిరాగము... "పట్టువిడువబోదు" వరుస)

పట్టువిడిచిపోదు-నా చెయి ||ప||

ఎట్టులనేగిన నావెన్క నె వచ్చు

కొట్టితిట్టినను, కొండల మొందదు ||ప||

సంతసమొందద నే-చింతనుతోలగును,

చింతించిన నే - చింతనుగూలును;

ఎంతయాదరము కలదో కోయనివరి-

తింతును నాదగురత్నమల్లదిగో ||ప||

సత్యాసత్యములను బోధించు,

నిత్యానిత్యములను చూపించు;

అత్యాదరమున నెద ప్రేమించు,

భృత్యకోటికి ముక్తినొసంగును ||ప||

చింతా—ఆహా! ఏమి మధురగానము!

బిల్వ—నావా రెవ్వరూ లేరా? ఉన్నారు, లేకేమి? అంధకారమున నరయలేకున్నాను. ఉన్నారు, నాదగ్గరే ఉన్నారు. లేకున్నచో, దుర్వారతరంగిణీమధ్యమున శవమును జారవిడిచిన దెవరు? క్ష్వేళవహ్నియైన కుండలి కరవకుండా నన్ను కాచినవా రెవరు?—నావారు లేరని అన్నవా రెవరు? ఇపుడు నాతో ఆత్మీయుడను అని చెప్పినవా రెవరు?...నీ వెవడవు? నీరూపమెట్టిది? నీ వతిసుందరమూర్తివి! ఒక్క సారి కంటపడవా? పోనీ ఎక్కడ నుందువో చెప్పు...నా ప్రాణాలు పోతూన్నవి...నాదగ్గరనే ఉన్నావు; నేనంధుడను కావున కాంచలేకున్నాను. నాకళ్ళు విప్పేవా లేరే?...నే నెక్కడికి పోవుదును?...(పోవును)

చింతా—ఎక్కడికో పోతూన్నాడు-విరాగి అయ్యేనా ఏమి? అతనివారు లేనప్పుడు నావారు మాత్ర మున్నారా? చూస్తాను-(పోవును)

దాసి—చిత్రముగా ఉంది వీళ్ళచర్య (పోవును)






# మూడో అంకము



మొదటి రంగము-రాదారి.

(సోమగిరి బిల్వమంగళుడూ వత్తురు)

సోమ—నీవు విదేశీయునివలె కనిపిస్తూన్నావు, త్యాగి వలె నున్నావు; నీ కాటంకము లేకుంటే నేటిరాత్రి నావెంట వచ్చి నన్ను కృతార్థుని చేయుము.

బిల్వ—అయ్యా, నావా రెవరో చూపగలవా? పోనీ చెప్పగలవా? నా కెక్కడా అట్టివాళ్లు కనబడలేదు.

సోమ—నీవు ప్రేమోన్మాదివగు మహానుభావుడవు. ఇదే నమస్కారము.

బిల్వ—మీరెవరో నే నెరుగను-నే నొక హీన లంపటుడను. నాకు మీరు నమస్కరించరాదు. నేనే నమస్కరిస్తూన్నాను.

మాడినాహృదయంబు - శోకగేహంబు
ఎప్పుడు నాకాడో - యిందు నాకిచ్చు,
తిమిరపూరము నాదు - దేహపంజరము
ఉండజాలదు ప్రాణ - ముముక్షితో జన
అయ్యయో! భంగంబు - గాదె నాయాశ
మరుభూమి సుధ్యాన - మనిగుంటి నేను.
ఎవడను? నేనిట - కేలవచ్చితిని?
ఛీ! ఏల నీయుదాసీనత గల్గె
ఏది మేలొనగూర్చు - నీప్రాణములకు?
ఏదియో ప్రేమాబ్ధి - యెచటుంచుచున్నదో?
గోరుచుందును ప్రేమ - గొమరొప్పజూప
ధన్యాత్మ చెప్పవే! ధన్యుండ నౌదు.

సోమ—అయ్యా! నీవు ధన్యుడవే. ప్రేమమయియైన రాధ నిన్ను ప్రేమపూర్ణునిగా చేసింది. నీకు భగవంతుని యెడ ప్రేమ కుదిరింది.

బిల్వ—అయ్యా! మిమ్మల్ని గురువుగా భావిస్తాను. ప్రేమమయియైన రాధ యంటిరి, ఆమె యెక్కడ నుంది?

సోమ—నేను గురువునా? శ్రీకృష్ణుడొక్కడే అందరికీ గురువు. ఇంకొకరు కారు.

బిల్వ—రాధ ఎవతెయా చెప్పవా?

సోమ—రాధాకృష్ణమూర్తులు నాకగుపడుతూన్నవి. అవే చూడు...ప్రేమ ఎంత గభీరమో ఎవ్వరెరుగుదురు? నీ

వామూర్తి ద్వయమును గాంచదలచుకుంటే వాటిని ధ్యానించు-ఆమర్మము గాంచగలవేమో చూడు.

బిల్వ—(ధ్యానించి) ఆహా! సత్యమే. ఇన్నాళ్ళూ నాకగుపడలేదు. ఆహా! ఏమి సుందరమూర్తియుగము! ఈ బొమ్మలు తథ్యమేనా? రాధాకృష్ణులను మనసుగాంచగలమా?

సోమ—దైవకృప లేకుంటే దర్శనము కాదు.

బిల్వ—కృష్ణు డెక్కడుండును?

సోమ—పిలిచి చూడు-అతడే చెప్పును.

బిల్వ—అయ్యా! మీ రెవరు? మృతప్రాయమైన నాహృదయమున ఆశాప్రసార మొదవజేసినారు. గురుదేవా! మీచరణదాసునిగా నన్ననుగ్రహించండి.

సోమ—అట్లనవద్దు. మీకు శ్రీకృష్ణు డాశ్రయ మిచ్చును! రండి—నా వాంఛాఫలసిద్ధి యొనర్చండి.

బిల్వ—మీరొకరు లభించినారు గనుక మిమ్ము విడువజాలను, మీయాన జవదాటను. దగ్ధమవుతూన్న నా హృదయమున ఆశాంకురము నాటినారు. ఆ లత ఫలించ డానికి మీకృపయే జీవనము, రండి పోదాము. . .(పోవుదురు)

---

## — రెండో రంగము —

(చింతామణి యింటిదగ్గర)

దాసి—అమ్మా, నీ వతని నిజముగా వలచినావు. ఆమాట నేనంటే "నన్ను తిట్టుతూన్నావు" అని అంటావు. అన్నము ముట్టవు, పాన ముసుగవు. రేయుంబగళ్ళదే చింత! నేమ వెళ్ళినవాడు రేవు రాకుండునా? కోపగించి ఎక్కడికి పోగలడు? పదిరోజులు చూడు, వరుగెత్తి వచ్చును. లేకుంటే మరిపదిరోజులు-కాకుంటే ఒక నెల—

చింతా—ఆత డిక రాడే, నేను బాగా ఎరుగుదును. నాకంట వడక యిన్నాళ్లున్నాడు! నన్ను వంచించినాడు-ఇది నిజము.

దాసి—పోనీ, నీవు క్రమక్రమముగా చిక్కిపోతూన్నావు, బెంగచేత కాబోలు? ఊళ్ళో నొకనంవన్నుడు నాకొర కెన్నోసార్లు వచ్చినాడట! నే నాతని లెక్కచేయలేదు. అతడు రెండుమేడలను వ్రాసియిచ్చునట!

చింతా—అయ్యో! నాకోస మాతడు సర్వమూ చెరచుకొన్నాడే! ఇప్పుడు దేశమును కూడా విడిచినా డేమో? ఆతని ఆత్మసంయమము నీ వే మెరుగుదువు?

దాసి—ఇంకా యిల్లుంది, వాకిలుంది. దేశమును త్యజిస్తాడా? పురుషుల స్వభావము నీ వెరుగవ ట్లుంది.

చింతా—కోపమే అయితే ఇంటివద్ద నేనా ఉండును...

ఒక్క క్షణము—మన ఇష్టాలు విడువకుండ ఉండుతా ఉండేవాడు. ఆత
డెంతాగమ్మ్యో మో!

దాసి—అట్టివాడు ఇంక నీకు ఎందుకు మేలౌను? ఇటు
వంటివాడా? నాకేమియుండదు నేను చూచినాను. నన్నేమని
నామాటను వినకుండేవా? ఈపుష్పములు నావద్ద కట్టిపెట్టు.

చింతా—వేటికి నాకళ్ళు పిడ్డవి. వలపన్న వట్టి
భ్రాంతి అని లోగడ తెలుస్తూ ఉంటిని, కాని ఇప్పుడు నిజము
తెలిసింది. నా ఖర్మ నిజమే! ఒక్కనాడేనా అతనితో మంచిమాట
ఆడినానా? అతను పిలవగానే కోపమువచ్చి తలుపువేసి పడక
గదిలో పడుంటిని. రాత్రిఅంతా అతడు మేడపైనుండెను.
నాకు నిద్రాభంగము వచ్చునంతనే భయముచేత రాత్రి ఒకమారైనా
నన్ను పిలువలేదు. . . నాకంటినుండి రెండు నీటి
చుక్కలు జారితే అతడు బాష్పవృష్టి కలిగించేవాడు! అతడు
నన్ను బతిమాలినకొద్దీ బెట్టుచేసి కాలితో తన్నుతూంటిని. . .
దానికి తగినశాస్తి నాకిప్పు డయింది.

దాసి—ఈప్రపంచములో ఎవరికి వారేకాని ఒకరి
కొకరు కారు. ఆకలిబాధ భరించ నలవికాదు! కోటివేషాలూ
కూటికొరకే! పురుషులు అద్దాలవంటివారు, మనము నవ్వితే
వాళ్లూ నవ్వుతారు, మనమేడిస్తే వాళ్ళూ ఏడుస్తారు!
పొట్టకోసము పరులను ఆశ్రయించాలి. చేసువ కొచ్చిన
వారిని చేత చిక్కించుకోవలెను.

చింతా—అట్లుచేర్చినవాడు మనవారు కావద్దా

అప్పుడే సుఖము చేకూరుతుంది. నాకు నచ్చినవాళ్ళందరినీ అరచేతిలో నుంచుకొన్నాను. సుఖపడవలెనని నా నుదుట వ్రాస్తే అట్లే ఉండి యుండును. ఇక నట్టివాడు నమకూరడు. రాణినై ఉండవలసిన దానను రట్టుపా లైనాను, వేశ్యనై వెగటుపుట్టించినాను. ఇంక నన్నట్లు మన్నించువా రుండరు.

దాసి.—ఎవరూ లేరనకు. అందరికీ ఆహారియే గతి-పరితాప పడకు.

చింతా.—ఆ పరమాత్మ నావంటి నిర్భాగ్యురాలిపై కృపవహించునా? అతడు దయానిధి అనీ ప్రేమసముద్రుడనీ ప్రతీతి, నేను ప్రేమరహితనైన వేశ్యను. నే నెవరినీ ప్రేమించక పోవుటచేత ఒకవేళ నన్నాతడు దయతో చూచినా అది నేను గ్రహించలేను. నాహృదయము ప్రేమశూన్యము... చూడు... నేను మునుపటిలా గున్నానా?... కాలినబొగ్గులాగు కనబడ లేదా? నాకోర్కెలన్నీ నీట కలిసినవి-ఎందరినో మోసగించినాను, అందుకు ప్రతీకార ముండదా? ఇప్పుడు నావంతు వచ్చింది!... కాని బిల్వమంగళుని నేను వంచించినట్లు నన్నాతడు వంచించలేదు. అతడు నేనే సర్వమని భావిస్తూంటే నే నాతని పాలిటికి కాలసర్ప మైనాను. అతడు ప్రేమార్ద్రహృదయు డవడముచేత భగవత్కృపాపాత్రుడు కాగలిగెను; నా హృదయమో శుష్కమరుభూమి...ఇందు ప్రేమాసారము కల్గబోదు !

దాసి.—ఆ! పుట్టి మున్గిం దంటూన్నావు! ఒకవుపోతే

ఇంకొకరు, ఏటులకోసము వెతకనక్కరలేదు. నీవే ఆలోచించుకో.

చింతా—సరే కాని పిచ్చిదాని వృత్తాంత మేమైనా తెలిసిందా?

దాసి—తెలియ కేమి? అది కలయింటిబిడ్డ, తల్లిదండ్రులుగానీ ఇతరబంధువులుగానీ లేరు. యోగ్యునకే యిచ్చి పెళ్ళిచేసినారు. అల్పకాలముననే పాప మతడు మృతుడయ్యెను, అప్పటినుండీ ఈమెకు పిచ్చియెత్తింది.

చింతా—ఈ కథ నీకేలాగు తెలిసింది?

దాసి—నాకు తెలియదా? మావీధిలోనే దానియిల్లు. ఎప్పుడూ అక్కడే తిరుగుతూంటుంది. పడుచువారి కంటపడితే బాధపెట్టుతూంటారు. ఇదిగో, యిక్కడికే వస్తూన్నది.

చింతా—ఈమె సాధారణపు పిచ్చిదికాదు. పరమాత్మునిచేత వంచింపబడి నాలాగేయింటినుండి వెడలగొట్టబడ్డది.

(పిచ్చిది వచ్చును)

పిచ్చి—పరమాత్మునికి నాపై దయ లేదని యెంచుతూన్నారా? ఆతని కందరిపైనీ కృపయున్నది. ఏమో నాయెడ మాత్ర మింకా దయరాలేదు, నన్ను మరచినాడేమో? ఎప్పటికైనా ఉద్ధరించితీరును.

చింతా—అమ్మా! నీ పేరేమి? సాక్షాజ్జగదంబవా?

పిచ్చి—ఔనమ్మా, ఆ యభాగ్యురాలను నేనే. అంతటా నీకామెయే కనబడుతూన్నదా?...మాటాడ కూరు

గో!...సిగ్గుచేటు...(నోరు నొక్కుకొనును)

చింతా—నీమాటలు విన్న నాఒళ్ళంతా కంపము చెందుతూంది. నీ వెవతె వమ్మా?

పిచ్చి—నేను వెఱ్ఱివాళ్ళ పిల్లను-నీకూతురిని-నీవే నా వెఱ్ఱితల్లివి-నేనొక వెఱ్ఱితల్లిని.

చింతా—

పాషాణహృదయమా-వల్లటిలె దేల?
అన్యులకథలకు నడలవీ వెవుడు
వంచనపాలైతివా!మానసంబ!
వేశ్యవు-నీవేల వేషభూషలను
మరచి ధరించితో మురికివస్త్రంబు?
వేడుకవుట్టెనా వెంగలివి కాగ?
క్రించుదనమున కిట్లు-వంచింపబడితో?
ఎవ డీసడించె నిన్నిట్టులు తుదిని!
కాయమమ్మితి తుచ్ఛ-కాంచనము చేర్చ
ధనమునార్జించి తేధన్యులకొరకు!
ప్రాణమర్పించవు-పరులకెన్నడును
కొత్తధర్మము దీని చిత్తమున నిల్పు.
అన్య లెక్కడనైన-యాప్త లయ్యెదరా?
నమ్మము దీనిని న్యాయ మియ్యదియొ.
కడచినదివసము-గ్లానంగరావు
వెలుగుపోకుండగనె- వెతకుకొనవలెను.

అమ్మా,నీవు వెఱ్ఱితల్లివా?

పిచ్చి—అవును-నాకు జాల మవుతూంది-సెలవిమ్మా పోతాను.

చింతా—నీవు నాకూతురి వంటివే!ఉండు నానగలు నీకిస్తాను.

పిచ్చి—తే-నాకు నగలన్నీ పెట్టవూ?

చింతా—(ఇయ్య బోవును-పిచ్చిది పారిపోవును)

దాసి—పారిపోయింది!

చింతా—పోనిమ్మా-మన యింటికి పోదాము రా—(పోవును)

దాసి—ఈమెకుకూడా పిచ్చి పట్టినట్లుంది.

(సాధువు వచ్చును)

సాధు—దాసీమణీ!

దాసి—ఏమంటావు!నాకు తల నొస్తూన్నది.

సాధు—ప్రేమోదంతము వినడానికిది సమయమా?

దాసి—సొమ్మ తెస్తే సొద వింటాను.

సాధు—అది లేదు,శుద్ధ విష్ణుప్రేమయే-గళమందు వనమాల—

దాసి—ఆగాగు-(స్వ)వీడికి చిన్నపని కల్పిస్తాను.—నాయజమానురాలికి మతిపోయింది-కనబడ్డవారి కందరికీ కానులిస్తూన్నది. పీడిమూలాన ఏమైనా రాబట్టెదను. సన్యాసులను చాలాసత్కరిస్తుంది. (ప్రకా) నీకృష్ణప్రేమను

చింతామణి కుపదేశించకూడదా?

సాధు—ఉపదేశించగలను,కాని నీ కుపదేశించవలెనని నాకోర్కె.

దాసి—అదినే నెరుగుదును.చింతామణిని చేఃపొమ్మా. ఈవేషముతో కాదు,పిచ్చివాని వేషము వెయ్యవలె ె—నా యజమాని వృత్తాంతము నీవెరిగినదే-కావలసిన సన్నాహము కావించెదను.ఆదాయములో ఎనిమిదోవాటా నీ వుంచుకో, తక్కినది నాది.

సాధు—నీమాటేకానీ-తరువాత నీకు ప్రేమ ఉపదేశిస్తాను.అప్పు డంతా నీదే!

దాసి—ఇంకేమైనా చెప్పవలసిం దుందా?

సాధు—లేదు.

దాసి—నీవార్జించిందంతా నాకిస్తావా?

సాధు—పొమ్మైనా? నాపాణాలే నీవి.

దాసి—నే నొకదగ్గర నుంటాను, నీ వింకోచోటుందు. నియింట్లోకుండలుతప్ప ఇంకేమీా ఉండరాదు, నీబట్టలపెట్టె నాయింట్లో నుండనీ;నీకూ నాకూ పొసగకుంటే కట్టుగుడ్డలతో నీవు బయటికి పోవలెను, నావద్ద నీకు దావరిక ముండరాదు.

సాధు—అలాగేకానీ.

దాసి—సాయంత్రము నీవువస్తే చింతామణిద్రవ్యము సేకరించే మార్గము చెవుతాను-చింకిగుడ్డలతో పిచ్చివాని లాగు రా- (లోపలనుండి "దాసీ"అనిపిలుపు)ఇదిగో వస్తూ

న్నాను. నాకు ఒనిగాన్నది. సాయంత్రము తప్పనిరా (పోవును)

(బిచ్చగాడు వచ్చును)

బిచ్చ—ఏమను ఇంది?

సాధు—అప్పుట కేముంది? సాయంత్రము రావలెను.

బిచ్చ—ఏమన్నది?

సాధు—నీవు చెప్పినట్లు రొక్కము పట్టుకొని రమ్మంది.

బిచ్చ—సరిసరి-ఇక సాయంత్రము రావడ మెందుకు?

సాధు—ఇంకోసారి యత్నించి చూస్తాను.

బిచ్చ—ఆఁ, నాదగ్గర దాచుతూన్నావు, సరిగా చెప్పలేదు. నేను చూస్తున్నాను చాలాసేపు గుసగుసలాడి నావే?

సాధు—ఇంకేమీ లేదు, ముడిమాటంతే! నావెంట వస్తే నీకూ తెలిసియుండును. పోదాము రా.

బిచ్చ—తెలిసింది-ఏదో వంకపెట్టి నాకళ్ళలో దుమ్ము కొట్టవలెనని నీయూహా! నేను లేకపోవడము నీకు మంచిదేగా? వరే-నడువు, నావం తెగవేయడానికే ఈయె త్తెత్తినావు.

సాధు—నే నాలాటివాడిని కాను... ఈ సాయంత్రము నీ కగుపడను-ఎక్కడికో ఎందుకో పోతాను... (పోవును)

బిచ్చ—మంచిది-వీనివెంట యుండును.

(పిచ్చిది వచ్చును)

పిచ్చిదాని కీనగ లెక్కడివి?... ఇవి చింతామణి నగలులా గున్నవి. తెలివిమాలిన దీనికి నగలెందుకో?

పిచ్చి—నీవేనా నవనీతచోరుడవైన గోపాలుడవు! (నగచూపి) ఇవి నీకు కావలెనా!...వీటితో ఆపుకో హాయిగా! (కొన్నిచ్చును.)

బిచ్చ—ఇది సి-ఐ-డి లోడి కాదు గదా? . ఎవరి కంటాపడలేదు-వీటితో నే నాశ్రమము నిర్మించుకో వచ్చును.

---

## —• మూడో రంగము •—

---

(సోమగిరి శిష్యుడున్నూ వత్తురు)

సోమ—నేడే గోకులబృందావనానికి పోదాము.

శిష్యు—మీరు చూడదలచిన మహాపురుషు డేడి స్వామీ?

సోమ—నే నతని దర్శించినాను-నీవు చూడలేదా?

శిష్యు—నా కాభాగ్యమబ్బలేదు.

సోమ—బిల్వమంగళుని నీవు చూడనే లేదా?

శిష్యు—ఏమీ!ఒక లంపటుని చూడడానికా మీరింత దూరము వచ్చినారు! వేశ్యమూలాన నతడు విరాగి అయి నాడు-ఈదశ ఎన్నాళ్ళుండునో తెలియదు.

సోమ—

కాంతయుకనకము గన నొకమాయవొ,
　　ఇటునటు లీడ్చెడు నీ జీవంబుల;
విషమబంధముల-విడివడిజాలక

మోహముగ్ధు లిల-మూల్గుచునుందురు.
సకల కామినులకాంక్ష బోవిడిచి
నిరంజనుండై నెగడెడు మనుజుని
సకలదిశాసంచారము చేసియు
నారసింపుము నీ వెక్కడ గననగు.
కామరహితమగు ప్రేమగన్పరచి
వేశ్యనుగొలువగ వెంగలియానా?
ఆశాశూన్యుడు స్వార్థవిహీనుడు
బిల్వమంగళుడు విజ్ఞుడు కాడే?
అర్థంబు కామంబు సరయ నిష్ఫలము—
క్షుద్రంబులగు నివిచొచ్చిన మనసు
ఆయతంబగు ప్రేమ కాధారమానా?
ప్రేమమత్తుండగు ప్రేయసుం డెపుడు
చిత్తంబు నీశ్వరాయత్తంబు చేసి
సంసారజలధిని సంచరించెడును.
నిస్సంగతత్త్వంబు నిష్ఠురనిష్ఠ
వావిరియగు వెర్రి వైరాగ్యమెపుడు
ఏకత్వమును బొందు నీశుతత్త్వమున.
శిష్య— సంశయచ్ఛేదంబు సరగ చేయగను
కృపచూపి చెప్పు డీకృపణు డీతండు
ఎట్లు మహాత్ముడై నెగడుచున్నాడు?
కామార్థములవీడి ఘను లెల్లయెడల

సన్న్యాసులై జోక సంచరించెదరు,
గౌరవింపరువారి గాని మీ రీతని
పెద్దజేయుట చూడ పెరిగె నుత్కంఠ.

సోమ—

ఎరుగవు వత్స నీ వెరుగనేలేవు
ఆశ్చర్యజనకమా నా మాయలీల-
ధనముకై కొందరు ధరియింత్రు జడలు,
కొందరు తిరుగను కులటలవెంట;
సన్న్యాసివేషంబు చాన గికురించు
జడలపొడవునబట్టి జరుగు గౌరవము.
అష్టసిద్ధుల నెవ్వ డాసించు నేడు!
నిర్హేతుకపుభక్తి నెరయు విరళముగ.
ఆకతాయి యటంచు ననబోకు మతని
ప్రాణమర్పించె నీశ్వరపాదములకు.
మానంబు దుఃఖ మవమానంబు సుఖము
వీడి గాంచునతండు వెన్నునిపదము,
వ్రజకిశోరునియందు వరలు నాప్రేమ
అన్యసామాన్యమా అరసిచూడంగ?
కౌగలించెను శవము కాంతకై యతను,
కోడతాచును బట్టి గోడ లంఘించె!
చేయజాలరు దేవి శ్రీరమణుకొరకు!
చిన్నికృష్ణునియందె చిత్తమున్నిలుపు.

మోహగంగాలునా । యీశునికృపము.
సదయుడై భక్తునకు । సర్వేశ్వరుండె
ఒసగ కోరినరత్న । మొసగి వడచేయు.
ఆకస్మికంబుగా । నరుదెంచి గురువు
ఉపదేశమొనరింప । నూడు సందియము.
చిత్తనైర్మల్యమున । చిగురొత్తు నాశ
ఈశునివాక్యమని । యెన్ని నిమిత్త
గుణవృత్తి మన్నించు । నురుభక్తితోడ—
ప్రత్యయంబున పొడము । ప్రాణికి లాభ
మీశ్వరుడే కర్త । యెందునకైన,
మానవుండు నిమిత్త । మాత్రుడుసుమ్మీ.
విశ్వాసము ఘటించు । విశ్వేశుకృపను.
వాగ్రూపమున బ్రహ్మ । వరలుచున్నాడు,
దాని నెరిగినవాడె । తత్వజ్ఞుడగును.
బిల్వమంగళుడట్టి । విజ్ఞుండుగాన
నతడు గురువగు నాకు । నతనిశిష్యుడను
ప్రియుడాతడే । ప్రేమహీనుండ
ఎప్పుడు పొందుదునో । ప్రేమ నామదిని!
వత్స పోవుదమింక । వాని వెదకుచును... (పోదురు)

(బిల్వమంగళుడు వచ్చును)

బిల్వ—చిత్తమా, తత్తరపడకు స్థిరముగా నుండు... నీచపలత్వము విడువవా? హా యెంతదూరము పోదువో...

దేవా! నీవు హరిభజన మొనర్చుతూండు. (కర్ణమూయును)

(అహల్యా, దాసియు వత్తురు)

దాసి—అమ్మా! ఇతఁ డొక ఉచ్ఛిష్టభో

అహ—అలాగనకు. సాధువులా గున్నాఁడే-చూడు—జపము చేస్తున్నాఁడు.

దాసి—ఈతని కున్మాద మమ్మా! చూపుతా నుండు. ఓరి పిచ్చివాఁడా! అన్నము తింటావా?

బిల్వ—ఓహో! స్వర్గానికివెళ్ళినా సవతిపోరేలన్నట్లు ఇక్కడికి వచ్చినా ఏకాంతమైన చోటు లేదాయెనే?

(అహల్యనుచూచి) కన్నులారా! ఏమి మీపోకరు? మానసమా, ఈమూఢచక్షువులకు దాసి వవుతూన్నావా? చాల్చాలు, నీబుద్ధి! దృష్టినిమరల్చు.

దాసి—అమ్మా! అదిగో పిచ్చివాడు నిన్నేకాగ్ర దృష్టితో చూస్తూన్నాఁడు. ఇక్కడ మన ముండరాదు-నడువు-వీడికన్నులు చింతనిప్పులలాగు వేపచిగుళ్లవలెనూ ఎఱ్ఱవారి నవి... (పోదురు)

బిల్వ—కన్నులారా, నన్నెంతకాలము మీదాసునిగా చేయగలరో చూస్తాను-(వారి వెంటనే పోవుచు)

దాసి—అమ్మయ్యో! పిచ్చివాడు|మనవెంట పడ్డాడు. త్వరగానడువు, నాకుభయము వేస్తూన్నది!

అహ—అతనితోమాను మనకెందుకు? మనదారిని మనము పోదాము. (పోవుదురు)

—• నాలుగో రంగము •—

(చింతామణి యింటియెదుట పాకలో బిచ్చగాడు
బైట దాసి సాధువున్నూ ప్రవేశము.)

దాసి—ఇంట్లోకన్న యిక్కడమేలు నాల్గువైపులా దారులున్నవి, మనమాట లెవరికీ వినిపించవు.

బిచ్చ—(స్వ) అక్లే యున్నారోండి-నే సిద్ధముగా ఉన్నాను.

దాసి—నీవు తిరిగీ బ్రాహ్మణత్వానికి సిద్ధమయినావా? పిచ్చివానిలాగు రమ్మన్నాను కానా?

సాధు—నీతో నొకరహస్యము చెప్పవచ్చినాను.

దాసి—నీ కృష్ణప్రేమ అటుంచి, కర్తవ్య మూహించు. మాయజమానురాలి వృా షేమీ చూడడములేదు. బీదసాద లెవ్వ రగుపడినా, వారికి కావలసినంత ధన మిస్తున్నది. నీవూ అడిగిచూడు, నీప్రాప్త మెట్లుందో.

సాధు—చెట్టంతా పెల్లగించడము శ్రేయము కాదా?

దాసి—అనగా?

సాధు—దేనినీ చూడలే దన్నావే?

దాసి—ఓహో! అంతా ఒక్కసారే హరిస్తా నంటావా? అబ్బో? ఒకక్షణమైనా యిల్లు విడిచిపోదు. తలుపులన్నిటికీ తాళాలు, సాయంత్రము స్నానానికి పోతుంది. దొంగలాడితే నీకు మంగలము దొరుకునేమో! ఇనుపపెట్టె బద్దలుగొట్టి లొద్దు లొనుగూ దక్కించుకోగలవా?

సాధు—నాభావము నీకు బోధపడలేదు. అన్నమూ పానమున్నూ అరసి చూచునా?

దాసి—ఆ గోలేలేదు. ఏమి చేయదలచుకొన్నావు?

సాధు—అయితే మరీమేలే.

దాసి—నీళ్ళు నమలక చేయదలచింది దేదో చెప్పు.

సాధు—పాలలో విషము కలిపితే?

దాసి—అమ్మయ్యో! విషమే! విష మెవరు పెట్టు తారు? నాచేతకాదు సుమా! నాపీకమీదికి తేవలెనని నీ యూహ!

సాధు—అలాగు కాదు. రాత్రి నదిలో స్నానముచేసి వచ్చును కదా? వంట చేయడము నీవే, ఆమె పిచ్చిది, అసలే తెలుసుకోలేదు; పాలలో కలిపిపెట్టి నీదారి నీవు పట్టు.

దాసి—నీ కనడము సులభమే, నా ఒళ్ళు ఒడకు తూంది, ఆపని నాచేతకాదు. నాకు విషము దొరకడ మెలాగు?

పెట్టినప్పు డెవరికంటనైనా పడితే నన్ను రక్షించేవా రెవరు? నా వల్లకాదు. సుమా.

సాధు—పిచ్చిదమ్మ త్తినవాళ్ళు చచ్చుట మేలుకాదా?

దాసి—నీ వెంతచెప్పినా సరే, ఆపని నావల్లకాదు.

(పిచ్చిది వచ్చును)

సాధు—(పొట్లముతీసి) ఇదిగోనుందు, తీసుకొనిపోయి పాలలో కలుపు. ప్రాణము పోగానే పూడ్చివేతాను.

దాసి—నీకి దెక్కడిది?

సాధు—ఇదెప్పుడూ నాదగ్గర నుంటుంది. నా కను తుణమూ చావవలెననే యుంది, కాని మీవంటి ప్రేమచేత నిట్లు జీవించియున్నాను. నీవు విప్పకుంటే నావవము నిశ్చయము!

దాసి—ఈ పని నావల్ల కాదు. వంటింట పాలున్నవి, నీ చిత్తము వచ్చినట్లు చేయవచ్చును—నేనింట్లో ఉండను—అంతా నీవే చక్కచేయుము.

సాధు—నే నొక్కడనే సాధ్యకలనా?

దాసి—పడుచువాడవు సాధ్యతేనా? నాచేతకాదు సుమా! ఆమా లంటేనే నాకడలు.

సాధు—నీకేమి భయమూ? రహస్యమైన చోటు చూపితే మిగిలింది నేనే సర్దుకొంటాను.

దాసి—ఆమె సర్వస్వమూ నాచేతిలో నుంది-మంచి వాళ్ళు దొకటే మాట-ఏమి జరుగుతూంటుందో చూస్తాను.

సాధు—అదీ మాట! (పిచ్చిది పోవును)

దాసి—చెప్పే దొకటి, చేసే దొకటి నాచేతకాదు.

బిచ్చ—అబ్బా! ఈదుర్మార్గు డెంతచేయ దలచినాడు! తలవ్రాత ఎట్లుంటే అట్లు తప్పకుండా జరుగును. అదే ఆమె వస్తూన్నది, అంతా ఆమెతో చెప్పుతాను. ఈ పిచ్చిదికూడా వచ్చిందే?...పాపముచేసిన ప్రాణము క్షోభిస్తుంది - పావ మమాయికురాలి నెంత చేయదలచినారు వీరిద్దరు! ఆమె రావ

కేమిస్తే తీరుతుంది. అందరూ మంచివారనే యెంచుతూంది. (అని తొందరగా వచ్చును)

చింతా — సూర్యు డస్తమించినాడు, మరల రాత్రి అయింది; కనుబొట్టు లెవరైనా నన్ను చంపితే నా కిహమూ పరమూ కూడా చెడుతుంది-మనసా, ధనము నార్జించడమునకే కదా లోకుల మానసములందు వ్యధ పట్టిస్తూన్నావు, అట్టి వారు నిద్రకి సెల విప్పవలెను కదా!...బిల్వమంగళుడున్నంత కాలమూ ఈయూహ తోపనే లేదు. అయ్యో! మానసమా, అతని ప్రేమ నొకనాడైనా రుచి చూచినావా? హీనమగు వేశ్యా మానస మవు-నీతల్లి నిన్నిందు ప్రవేశింపచేసింది-ఈ జన్మ మధ్యాన నీవా డనరగినవా డొకడైనా ఘటించినాడా? ఏ రూపౌద్ధత్యము బిల్వమంగళుని మర్మముల ఛేదింపగల్గెనో ఆ రూపమే ప్రకృతమున నీకు అమితాపకారి యైంది. ఎందరి నెంతక్షోభ పెట్టి యుంటివో ఆలోచించుకో. నిరాశ్రయివగు నీవక్షమున ఎవరైనా కత్తితో పొడుస్తే ఏమిచేయగలవు? తుదకు నీగతి యింతకు వచ్చిందా! నీకు మృత్యువు తప్పదని ఎప్పుడైనా భావించినావా? అట్టి దిన మెప్పుడు వచ్చునో ఇప్పుడైనా ఎరుగుదువా? నీ కెవరు దిక్కు? ఎక్కడికి పోయెదవు? మహాపాతకివైన నిన్నుద్ధరించువా రెవరు?...పోతాను... బిల్వమంగళుని దగ్గరకే పోతాను! అతడు సాధుసంపన్నుడు, నన్ను నిరసించడు...నా కాముష్మికసుఖోపాయము తప్పక ఎరిగించువాడు...నే నొంటిగా...అబలను...ఎట్లు? పోగలను?

అతని నెక్కడ వెతకనగును? ఈ పాపాత్మురాలను నా కెట్లు శ్రమ వైనదే!

(పిచ్చిది వచ్చును)

పిచ్చి—అమ్మా! అమ్మా! నేను చిన్నప్పటి నుండి ఉన్నాను. అదిగో... నక్క లీసుప్తూలిసుకున్నవి-చూడు, చూడు-నేనూ కడుపునిండా తిన్నాను-పశువులు క్రిములు పక్షులూ అన్నీ అలాగే తింటూన్నవి...అదే-అదే-చూడు.

చింతా—మాయింటికి వస్తావా?

పిచ్చి—రాను-ఇక నింటికి రాను- అత డక్కడ లేడు-నీ అల్లుడు...వెఱ్ఱివాడు ... ఇంట్లో లేడు...శ్మశానములో ఉన్నాడు! ఇక నింటికి రాను-అనంతా శూన్యము!

చింతా—నిజమే-ఇంటికి పోవడమన్న భయము వేస్తూంది.

పిచ్చి—అమ్మా! విషము, విషము-సుగవాడూ ఆవిడా ఆలోచించుకున్నారు. సముద్రమథనము చూడబోయినారు-విషము...విషము-నీవు నావెంట రా. విషము తాగలేవు! సంసారసముద్రమథనం చేస్తే విషము వెలువడుతుంది. వారు మా గారీ చూడబోయినారు. . ఎరుగుదువా?

బిల్వ—ఓహో! ఇది వెఱ్ఱిది కాదు-దీనిమాటలన్నీ నిజము. (పిచ్చిదానితో) నీ వెవర్తె వమ్మా? (చింతామణితో) ఈమెమాటలు నిజము సుమా! ఈమె ఎవర్తెనో మహాత్మురాలు.

పిచ్చి—మురిపించి విడిచె నా • మోహను ప్రాణములు,
చేసెతి జగమంత • వెర్రెత్తి తిరిగి,
ఎటునైన నాకింక • నెవ్వారు లేరు,
ఏడ నున్నాడో నా • కెరిగింతు రెవరు?
చీకటిపడుచోటు • నాకదే యిల్లు,
శ్యామలమేనికి • శయ్యయగు నాకు,
ఆకస మగు నాకు • నాచ్ఛాదనంబు,
మర్త్యనైనను నేను • మరణింప బోను—
అతని మనసున నెట్టి • యాశ లుండెనో కో?
చింతా—ఎవ్వాడు నీభర్త • ఎలనాగ చెపుమ
పిచ్చి—ఐదుగురు పతులు నా • కబ్జాక్షి వినవె:
శివుడు, కృష్ణుడు, కాళి • శివ కాదు కాదు,
మగడొక్కడే నాకు • మగనాలి నమ్మ
అల్లడుగో నామగం • డదిగో నాభర్త
అన్యులెవ్వరు కారు • అతివరో నేను
అతనికి దాసిని • అన్యులకు కాను-
వేణునాదము చేయు • విశ్వేశు డదుగో.
నాకు సిగ్గౌతూంది-ఇక్క డుండలేను, విషము విషము, విషము-పరుగెత్తి నా వెంట రా!

బిచ్చ—అన్ని సంగతులూ తెలుసును, ఇదేటి పిచ్చి! (చింతామణితో) ఈమె పిచ్చి దనుకోకు, నిజమే చెప్పింది; ఈపాదలోనుండి నేనంతా గనిపెట్టుతూన్నాను. ఆ నాడు నా

వెంటవచ్చిన సాధువుతో నీజాసి నీకు పిచ్చిపట్టిందని చెప్పింది, వారిద్దరూ దుస్తంత్రము పన్నినారు; నేను పాలలో కలిపి నీకు విషము పెట్టడానికీ, ప్రాణాలు పోగానే పాతిపెట్టడానికి నిశ్చయించుకొన్నారు.

చింతా—విషమా! ఆమూలమూ తెలిసింది. నాన మాట తలుచుకొంటే దడ పుట్టుతూన్నది—

పాడుచిత్తమ నీవు • పరికించి చూడు
ఈధనము రూపు గని • కన్నంతకు మెచ్చు!
ఇల్లు జాతియు చేసె • నంత ద్రోహంబు.
పిచ్చి—అవి కావు హేతువు • లట్లనబోకు
లోభనీయము ధనము • లోకంబులోన
చెట్టుక్రింద వసింతు • శ్రీహరినేని
కోరనేదియు; కడలి • కూతు లోకనాథు
మద్దులుగా రా నా • పద్దకు రాగ
పోవమ్మ వేగమే • పొమ్మింక నామె
పోనాడితిని మించు • బోడిరో రమ్మ
ఇంటిలో గుండక • జంట పోవుదము.

చింతా—విషయము సంసృతి • వెగటు పుట్టించు
విడువజాలని ప్రాణి • వెంగలియె కాదె
మం దేహంతో దాని • నిందనుక వలచి
మత్తుచెందెను కాని • చిత్త మీనాడు
మేలకువచెందె నో • మేలత బోధింప,

జోకవుట్టెను మది • జోము దొరకగను,
వెర్రిదానా, నిన్ను • విమువంగజాలు;
కావమ్మ నమ్మితిని • రా ముద్దుగుమ్మ,
నీకోడ నుందాను • నీనీడ వోలె
అమ్మ నినుచూడ నా • కాశ పొడమినది
ప్రాణం బరసిన • గానంగరాను,
ధైర్యంబు చిక్కె నీ • దరి జేరుకతన,
శోకాలు నాయవి • కొనసాగగలవు.
నీవుచెప్పినదంత • నిక్కమే తల్లి!
కంకికోడవె తన • కడుపు నిండంగ
నింగికి విహాగంబు • నీల్గుచుపోయి
కొనితెచ్చుకొను నస • కోని యాపదలు.
వీడి సర్వంబు నీ • వెంటవచ్చెదను,
అభయమిచ్చితిగాన • నాశ్రయము దొరకె,
ఎట గొనిపోదువో-యీశ్వరువు మావ.

పిచ్చి—యమునాతీరమునకు పయనము కమ్మ.

చింతా—నడువు-పోదాము (తాళముచేతులు పార వేయును)

పిచ్చి—దాని నాకిమ్మ.

చింతా—తీసుకో...(ఎత్తి ఇచ్చును)

పిచ్చి—నీవు తీసుకో...(బిచ్చగాని కిచ్చును)

బిచ్చ—అయ్యో! సర్వస్వమూ విడిచి చింతామణి

పోతూన్నదా? ఇక నేనెవ్వరిని కాముకొని యుంటును! నేను కూడా వారివెంటనే పోతాను. (తాళము చెవులు పారవైచి) ఇంత కూటికున్న పోలీసువారు నన్నేమిచేయుదురో? ఇప్పు డేమి చేయగల్గినారు! నా నుదుటిరాత ఎట్లుంటే అట్లు జరుగు తుంది. వీరు ఇకశాటనము చేస్తారు. హరిభజనమే వారి కుభయతారకము. లోభము నెవ్వ డాపుకొనగలడు? జగదంబ దుర్గయే దిక్కు! ఈచింతామణి మృత్యువు నోటినుండి బైట పడింది కదా? నే నీపోలీసు వారినుండి తప్పించుకొ లేనా?... (పోవును)

---

——• ఐదో రంగము •——

---

(వర్తకుని ద్వారముచెంత బిల్వమంగళుడు)

వర్త——అయ్యా, మీరెవరు?

బిల్వ——నేను బాటసారిని, నిలువ నీడ అడుగ వచ్చి నాను.

వర్త——మీకీదశ పట్టిందేమి! మీవానస్థలమేది!

బిల్వ——ఎక్కడుంటే అదే నాయిల్లు.

వర్త——గృహస్థాశ్రమము విడిచినారా!

బిల్వ——లేదు.

వర్త——నేడు నా ఆతిథ్యము స్వీకరింతురా?

బిల్వ——అందుకే ఇటు వచ్చినాను.

విలువగల వచనంబు । తులలేని నగలు,
వాసన వస్తువుల్ । వలపు చేష్టలును,
అనురాగపూరితం । బగు మానసంబు,
గలుగంగజేసి । నాకడ కంపు నేను.
వ్యక్తపరిచితి పాప । సత్తమగు కోర్కె;
నెరవేర్ప వేడెద । నెయ్యంబు మీర;
కాదు నిర్బంధమిది । కాంచు మర్భకుడ,
నీయలేనన్నచో । నేగెద నిపుడె.

వర్త—(స్వ) విశ్వేశ్వరా! ఎట్టి । విషమసంకటము
దాపురించితి? వేది । దారి గనరాదు.
లేదన్న నీ యతిథి । లేచిపోయెడును,
ఎరుగంగజాల నిత । డే మహాత్ముండో,
తలముమీరిన యిట్టి । ఛల మేలపన్నె?
విముఖు జేయు విధ । విహితంబు కాదు,
సడల నిత్తునె అతిథి । సత్కారధర్మ;
మదికదా గృహమేధి । కధికధర్మంబు!
ధనము దారను వీడి । ధర్మరతుణము
చేయంగ సిద్ధించు । శ్రేష్ఠమగు గతులు.
కాంతయెవ్వతె నాకు? । కనక మెట్టిదియో?
ఋణము చెల్లిన పిదప । గణనకు రావు;
ధర్మమే ముక్తికా । ధారంబు గాన,
వేడ్కతో రక్షింతు । పేటిని విడిచి,

(ప్రకా) వింటిని దమ్మునుము । కన్గొంటి కెనయూడు,
ఏరీతి సన్నుప । రీతుచేయుదువె?
కొమ్మ నాకాంత నీ । కోర్కె తీరంగ
నీకాంతగా రేయి । నింపు తమకమున.
బిల్వ—కంటివా చిత్రమా।కన్నెంత గడుసా,
ఏమి చేయగనెంచి । తేమి నీవెర్రి?

—• ఆరో రంగము •—

(అహల్య-దాసి)

అహ—ఇంకోసారి పోయి అతనిని మంచిమాటలతో సమాధానపరిచి తీసుకొని రా. అతని కేదికావలెనంటే అదే భుజించనీ.

దాసి—నేను వెళ్లనమ్మా, బెల్లముకొట్టిన రాయి లాగ ఉలుకడు పలుకడు.

అహ—చీకటి పడేలాగుంది-ఒక్కసారి పోయిరా; అత డింతవరకు రాలేదనీ భుజించలేదనీ అయ్యగారికి తెలిస్తే, నా మొగ మింక చూడరు-వారు వచ్చువేళ కావచ్చింది. పో, పో.

దాసి—మొగము ముడుచుకొని మొద్దులాగ కూర్చు న్నాడని మనము చెప్పలేమా? ఆ నిర్భాగ్యు డెక్కడా కనబ డడు; పెద్దయింటిపడుచు వుక్కెడు నీరైనా తాగలేదని ఎరు గడా? అనలే పిచ్చిముండాకొడుకు! బిందెడు నీళ్లు నెత్తిమీాద పోస్తే మెదడు చల్లబడి మతికుదిరి అప్పుడు తింటాడేమో?

(వర్తకుడు వచ్చును)

వర్త—దాసీ-నీవు అతిథిని భోజనము కాగానే నావద్దకు తీసుకొని రా.

దాసి—ఎట్లు రాను? ఆపిచ్చివా డెక్కడున్నాడో?

వర్త—పిచ్చివా డనకు, అతడు మహానుభావుడు! చండీమండపమందు కూర్చుండును, పోయి తీసుకొని రమ్ము. (అది పోవును)

ప్రేయసీ, నీదగు । వేషభూషలను
　　గాంచ పులకితమయ్యె । గాత్రంబు చూడు;
ధన్య వీరూపమా । ధారంబు గాగ
　　నచ్చెను నీకివ్వ । దక్షాత్ము కొల్వ;
హితము బోధింతు నో । యతివరో వినుము:
　　సారంబులేనిసం । సారంబులోన
ధర్మమొక్కటె సుమ్ము । తథ్యంబు,దాని
　　రక్షణచేయువ । రీక్షయగు నిలను—
అతికష్టములు మనల । నలమిన గాని
　　విడువగూడదు ధర్మ । మిదురాజ వదన,
అన్నమాటను నిల్పు । టంత్యధర్మంబు.
　　అగ్నిసాక్షిగ నిన్ను । నందిన నాడె
అతిథుల నర్చింతు । మని బాసచేసి
　　గార్హస్థ్యపదవిని । గా లూనితిమిగ.
దైవకృప నిన్నటి । దనుక నది జరిగె,

నేను కానన్నది ! చూడు పరీక్ష,
నిల్పుదువో వ్రతిన ! నిల్పజాల వొకో
నీయందె ఉన్నది ! పాయకుము దాని.
దీనుండు హీనుండు ! మ్లానవదనుండు
నాకాంతుతోఁడ న ! న్నడిగెను, "రేయి
నేకాంతమున నొసగు ! నీకాంత నాక "ని
ఎంత యాశ్చర్యమో ! యింతి కనుగొంటె,
పతినిగోరుట యిమ్మ ! నతిని నాకంచు?
ధర్మరక్షణ మనకు ! తప్పదు గాన
అతిధికోర్కెను తీర్పు ! మతిప్రసన్నతను,
నత్కార్యమున గాదె ! సద్గతులు కలుగు!
అహా—హానాధ, మీరిట్టులాడంగ తగవె?
విపరీత మిటులాడ ! వేడ్క పొడమెనో కో?
మానమే భూషణము ! మానవతి కెందు;
భంగంబు చేయుదురె ! భర్తలే దాని?
ధర్మమార్జింప న ! ధర్మ మొనరింప
వచ్చునే? మనఖ్యాతి ! మచ్చమాయదొకో?
మానంబె భూషణము ! మానవతి కెందు
కోలుపోయిన దాని ! గోడు చేకూరు.
కావర మది యన్య ! కాంతను గోరు
టొప్పకుండిన నగునె ! తప్పు మన కిందు?
మీరలే ప్రాణంబు ! మీరలే యాత్మ,

మీరలే జ్ఞానంబు నాకు । మీరె ధ్యానంబు,
శివుడైననేమి కే । శవుడైన నేమి?
ఇతరుండు నా మది । నెలయుజాలు నొకో?
సర్వదేవతసార । సంభూతులయ్యు
కుత్సితాచారంబు । కొనజూతురేల?

వర్త—త్రికరణశుద్ధిగా । నకలంకప్రేమ
నీవుజూతువు నన్ను । నెరుగుదు నబల,
కోరవు ప్రేమకు । మారుప్రేమంబు,
తుచ్ఛమగు స్వార్థంబు । ద్రుంచలేనైతి.
నాసొత్తు వీవని । నమ్మితి గాన
నేను వితరణచేయ । నీకు జంకేల?
సారంబు ధర్మంబు । సంసారముననుం,
ఇతరార్థచయ మంత । హీనసారంబు!
అతిథి పోద్రోలిన । నడగు ధర్మంబు,
ధర్మంబు తప్ప మి । థ్యావాది నగుదు;
గళితుడగు నీభర్త । కంటకము కాడె?
కనుక నామేలు నే । డొనగూర్పు మతడు
కోరినదెల్ల నే । గూర్చెద నంటి-
క్షమియించు జాల్మడ । సత్యంబు నిల్పు.
స్వార్థపరుండనై । చాన! నిన్నిట్లు
అర్జించుచుంటినే । నాత్మధర్మంబు.
అతిథిపూజావ్రత । మాదుకొనునాడె

చింతింపబోలు నీ ॥ చిక్కు నిర్వారము.
స్వర్గంబునకు త్రోవ ॥ సంకటం బతివ!
"సమకూరు విఘ్నములు॥ సత్కార్యములకె".
సరకుచేయక విఘ్న ॥ సమితి కార్యములు
నిర్వహించుట సుమ్మ ॥ నియతి ధీరులకు;
అతిథి కోరినదాని ॥ నర్పింతుమనుచు
నియమంబు దాల్పమే ॥ నెలత! ఇర్వారము?
"ఒప్పకుండిన నగునె ॥ తప్పు మన" కంటి
వ్రతభంగమును చూడ ॥ వత్తురా జనులు
అనుచు దలపగరాదు ॥ అతివరో! సర్వ
సాక్షి లేడే హృదయ ॥ సారసంబునను?
వాని మొరంగుట ॥ వశమౌనె మనకు?
ప్రఖ్యాతి వడసితివి ॥ పతివత్ని వనుచు
నీసద్వ్రతపరీక్ష ॥ నేడు కాగలదు,—
నీపతిధర్మంబు ॥ నిల్పుదువో లేదొ
ధర్మసాక్షిగ నేడు ॥ తథ్యంబు తేలు.
ఆగంతువుండగు ॥ నాదివిష్ణునకు
ధారపోసితి నాదు ॥ దారవగు నిన్ను,
ధర్మమగునో కాదొ ॥ తథ్య మారయుము-
అహా—తరుణుల కట్టివి ॥ తర్కంబు తగదు;
ఇట్టిచో నన్ను వ ॥ రీక్షించనేల?
మీకు దాసిని కాన ॥ మీయాజ్ఞ శిరము

నందు దాల్చెచె నాకు । నౌను విధి నతము,
బదులుచెప్పను నేను । పతియాజ్ఞ కెవ్వుడు.
వర్త—తరుణి! ధర్మంబులకు । దైవమే కావు,
అతిధిపూజాధర్మ । మత్యుత్తమంబు.
(దాసి వచ్చును)
దాసి—అయ్యా, అతిధి యంగణమున నున్నాడు.
వర్త—ప్రేయసీ, నేను వానిని తోడుకొని వత్తునా?
అహ—ఇంక నాలస్యమేల? అన్నిటికీ మిమ్మే నమ్ముకొన్నాను.
(వర్తకుడూ బిల్వమంగళుడూ వత్తురు)
వర్త—ఆర్యా, ఈమెయే నా గృహిణి, మీ చరణదాసి...(పోవును)
అహ—అయ్యా, మీ రీశయ్య నలంకరించండి.
బిల్వ—వలదు-ఇక్కడ నుండియే నిన్ను వీక్షిస్తాను.
(స్వ) మానసమా! నీవు । కానంగ లేదె
కన్నులు నిన్నెట్టి । గతి కీడ్చితెచ్చె?
ప్రభవించితివి నీవు । బ్రహ్మముఖమునను,
వీరిడి వైతివి । వెలయాలి నమ్మి,
పితృశ్రాద్ధమొనర్ప । ప్రీతి విడచితివి,
కోలుపోయితి ధృతి । కులట గలియుటకు;
ఓరుగాలియు వాన! । ఘోరమగు రాత్రి
పోరాడు చుండగా । వ్యోమంబు భూమి

కల్లోలయుతమైన । గంగలో దుమికి
శవము నాశ్లేషించి । చావుతప్పితివి!
భ్రాంతిచే సర్పంబు । రజ్జువు గాగ
ఫలటను గాసంగ । గోడ దాటితివి!
ఏమి పురస్కార । మిచ్చె నావేశ్య?
కారించు నాతిర । స్కారంబు గుండె
వ్రక్కలు చేయంగ । వైరాగ్య మూని
సర్వంబు త్యజియించి । సన్యాసివైతి;
కృష్ణు డెక్కడ యంచు । కీరంబు వగిది
బిగ్గర నరచితివి । ప్రేమ నుప్పొంగి.
వీక్షింప నీతెరగు । విస్మయం బాదవు!
పాపిచిత్తమ! నీవు । పల్వలము చెంత
పలుమారు ధ్యానించు । బకమువలె నుండి,
కంకణంబులరవము । కర్ణముల సోక
నపురూపముగను ము । త్యవు చిప్పవోలె
తెరచి కన్నుల గాంచి । తెరవ నొక్కర్తు.
సైపంగలేక మరు । శరముల శారి
చెరుపవచ్చితి వామె । శీలంబు నిపుడు.
ఏమి యున్మాదమే । కాముకుల గనిన!
కన్ను లున్నవటంచు । గర్వ మిదియేల!
ఈపాటి భాగ్యంబు । రూపరు నంచు
వందురు దేమి? కను । వాటి దుండగము

ప్రాణంబు పోవునను । భయముచే నదిని
క్రోడము చేర్పించె । కుళ్లిన శవము!
హేయమగు వస్తువని । ఎంచమే దాని?
పునుగు జవ్వాజియు । పుత్తడి నగలు,
విలువైన వసనంబు । వెలలేని హారాలు,
ఈరేడుజగముల । నీసడింపగజాలు
నిట్టి తనులత కూడ । నట్టిదే నమ్మి.
బొందిలో ప్రాణంబు । పోయిన వెన్క-
వెడలును దుర్గంధ । వీచికలె దీన,
నిది నాశరహితమని । యెంచితివే చెపు?
సారహీనంబు సం । సారమని యెరుగు,
హీనతర సారంబు । నీతనువు! రోత!
కన్నులు మెరుగును । గని భ్రమియింపగ
వెర్రివై వక్తకుని । వేడితివి భార్యన్.
నీదు రత్నంబులే । నిన్ను వంచించె
ఇవి లేకయుండిన । నింత వచ్చేనా?
కోలుపోయిన నిధి । కొంత శ్రేయంబు
కోరగాను పోయిన । కొరత యుండదుగా?
నిస్సార మెప్పుడే । న్నిత్యధన మగునా?
ఈహా వీడుమ యిట్టి । మోహజాలమున.

(ప్రకా) తరుణీమణీ, నీ సిగపువ్వు నిట్లిమ్ము. (ఆమె యిచ్చును) నాయాజ్ఞ నీ కవిలంఘ్యమని నీభర్త నీతో

చెప్పనా?

అహ—చిత్రము.

బిల్వ—అమ్మా! నేను మీ వెంగళినుతుడను, ఈ మాట నీవతితో మనవిచేయుము, పొమ్మా.

అహ—నిజముగా నీతఁడు మహాత్ముఁడే!...(పోవును)

బిల్వ—మానసమా, ఇంత । మమత నీ కేల?

కాలసర్పంబు లీ । కళ్ళంచు దలచి
శత్రునాశంబును । సమకట్టు చేయు;
ఉత్తమసయనంబు । నిత్తు నిత్తరిని.
దాన జూడగవచ్చు । దానవారాతిన్.
జ్ఞానంబు నిచ్చునదె । జ్ఞానేంద్రియంబు
తనుకుడ్య జాలరం । ధ్రంబు లీకళ్ళు.
జ్ఞానరత్నము గొన । జాలు తస్కరులు!
పొడిచెద వీటిని । పొల్లువో తుడిచి
సారంబు గొనెద నం । సార నస్యమున.

(కళ్ళు పొడుచుకొనును)

కళ్ళు పోయెను కాన । కదలుడీ యింక
కాలు నేతులు మీరు । కంజాక్షు గొల్వ.






# నాలుగో అంకము

## — మొదటి రంగము —

(చింతామణి ఇంట్లో గది. దాసి, సాధువు వత్తురు.)

దాసి—ఎక్కడికి పోయిందో ఊరంతా వెదకినా ఎక్కడా కనబడలేదు.

సాధు—ఆ పిచ్చి సముద్రములో పడి యేవాడకో కొట్టుకొని పోయింది.

దాసి—మన మేమి చేతాము?

సాధు—అదే గొప్ప సమస్య. పోలీసువాళ్ళకి తెలుస్తే ఇదంతా కొనిపోతారు. ఏమిటి దారి?

దాసి—ఔను. మొన్న అంబిక ఆస్తంతా తీసుకొన్నారు. మగవాడవు, నీవే ఆలోచించు. ఆడదాన్ని నాకేమి తెలుస్తుంది?

సాధు—సొత్తంతా బైటికి దాటించవలెను. అదే మనము చేయతగ్గ పని.

దాసి—దాటించడ మేలాగు? పెట్టె చాలా బరువు, గోడలో తాపడము చేసినారు.

సాధు—అదే చూస్తూన్నాను-

దాసి—పోదలచుకొన్నది తాళముచెవులేనా నాకిచ్చింది కాదు, దానికి నే నెంతమేలు చేసినాను!...కలి కాలము!

సాధు—అంత ధర్మదృష్టి యిప్పటివాళ్ళకా! "ధర్మస్య సూక్ష్మాగతిః" అంటారు.

దాసి—మాటల కేమికాని, ఈ పాదుపెట్టెను పైకి త్రవ్వగలవా? మగవాడ వాపాటి బలము లేదా? గునప ముంటే నేను త్రవ్వితీయగలను!

సాధు—చప్పుడు కావచ్చునా? గట్టిగా కొట్టి బద్దలు చేయవచ్చును, కాని చప్పుడు మాటో?

దాసి—మగవాడవు- ఈపాటి ఉపాయము తోచ లేదా నీకు?

సాధు—ఆలోచిస్తూన్నాను.

దాసి—మూడు నాళ్ళనుండీ మొత్తుకొంటున్నాను- [illegible]ర! ఆలోచన శూన్యము! పోలీసువాళ్ళు వచ్చేవరకే నీకూ ఉపాయము తోస్తుంది కాబోలు!

సాధు—ఏమి చేయమన్నావు? నేను తలచిందొకటి, అయింది ఇంకొకటి! గోడ త్రవ్వి పెట్టె తీస్తాను- అదృష్ట మెట్లుంటే అట్లా జరుగుతుంది- (త్రవ్వబోవును)

([illegible]—ఎవరక్కడ? తలుపు తీయండి)

దాసి—అమ్మబాబోయ్! ఎవరు పాడు? పోలీసువాళ్లే [illegible]

(లోపల—తీయరేమి? మేము పోలీసువాళ్ళము.)

దాసి—అన్నా! ఏమి గతి? కొంప మునిగిందిరా దేవుడా!

(లోపల—తలుపు బద్దలు చేయనా? తీస్తారా?)

సాధు—చూడు. ఇది నాయజమానురాలి సొత్తని నేనంటాను, నీవాలాగే సాక్ష్యమియ్యి.

(పోలీసు ఇన్స్పెక్టరు, జవానులు వత్తురు.)

దాసి—ఇనస్పేటు బాబూ! దొంగ! దొంగ!

ఇన— ఔను. ఈయింట చోరీ జరిగినట్లున్నది.

దాసి—బాబూ! ఈమనిషి ఇనస్పెక్టై తవ్వుతున్నాడు.

ఇన—మేము రావడము చూచి "దొంగ" అని కేక వేసినావు. మంచిది (సాధువుతో) నీ వెవడవు?

సాధు—నేను చింతామణి పెంపుడు కొడుకుని. ఇదంతా ఆమెసొత్తు. నా కామె యిచ్చింది.

ఇన—తాళముచెవులు నీవద్ద నున్నావా?

1 జవా—లేనట్టే-ఉంటే పగులగొట్టడ మెందుకు?

ఇన—నీ వ్యూరకుండు-తాళముచెవు లెక్కడ?

సాధు—(స్వ) ఓహో! ఇతడు నన్ను విచారణచేస్తా న్నాడు!

ఇన—వీరిద్దరినీ తీసుకొనిపోయి, పిడివి చెరలోనూ, దానిని గదిలోనూ ఉంచండి-ఈ యిల్లంతా శోధించి వస్తాను.

దాసి—బాబూ! దండములు-ఈమనిషి దొంగరనా

నికి వచ్చినాను, నే నీయింటి దాసిని, నా కాపుర మిక్కడే, చింతామణి నా యజమానురాలు. బాబూ! దండాలు! నా ధనము, ప్రాణము, మానమూ మీచేతిలో నున్నవి. నాకు బేడీలు వెయ్యాకండి-నేను చెప్పినదంతా నిజము.

ఇన—వీళ్లవద్ద తాళము చెవులున్నవేమో పరీక్ష చేయండి.

1 జవా—ఓరీ, నీకు మరణము తప్పదు-ఈనేరము నకు శిక్ష తప్పదు-న్యాయాధికారితో చెప్పుకొందువు పద.

సాధు—అలాగే!నడవండి-(వారి నిద్దరిని గొనిపోదురు(

ఇన—మానసింగ్, ఈపెట్టెను బైట కీడ్వాడాని కెంత మంది కావలెను? నీచేత నవుతుందా?

2 జవా—ఇం కిద్దరు కావలెను.

ఇన—మనవల్ల కాదన్నమాటే. ఇద్దరుంటే చాలునా?

2 జవా—ఇం కిద్దరుంటే మంచిది.

ఇన—దొంగ దొరకినాడు కదా? వీడికెంతో చిక్కి యుండదు. ధనమంతా ఈపెట్టెలో నుంటుంది-నీ విక్కడ జాగ్రత్తగా నుండు-నేను బయటికి పోయి రిపోర్టు వ్రాస్తాను.

2 జవా—అలాగే.

ఇన—నేను బైటికి పోతాను-రిపోర్టు నీవు తీసుకొని స్టేషనుకు వెళ్ళుదువు గాని.

[ మొదటి జవాను వచ్చి ]

1 జవా—మహాప్రభూ! ఖైదీలు విషము తిని చచ్చి

నారు ?

ఇన—విషమా ! విష మెక్కడిది ?

1 జవా—ఆ మగవానివద్ద నుండెను.

ఇన—వాడు చచ్చెనా!

1 జవా—వాడే కాదు-అదీ చచ్చింది.

ఇన—పదరుబోతా? ఇద్ద రెలాగు చచ్చినారు?

1 జవా—మొదట మగవాడు విషము తిన్నాడు. నేను వాడిని శోధిస్తూంటే ఆడది కూడా విషము తిన్నది-ఇద్ద రికీ ఊపిరి లేదు. శవములు స్టేషనులో నున్నవి.

ఇన—చూచితివా? మానసిం౯్, ఎంత ఘోరమో- (పోవుదురు.)

---

## —• రెండో రంగము •—

---

( నడితోవలో చింతామణీ పిచ్చిది.)

చింతా— ఇక్కడ కొంతసేపు కూర్చుందాము. నేను నడువలేను, అలసినాను.

పిచ్చి—అలాగా ? నేను కూర్చోలేను. అతడు నాకై యెదురు చూస్తూంటాడు. ఆలస్యమైతే ఏమంటాడో ? నీవు నీ నాథునిచేర పొమ్మా- నేను నా నాథుని చేరపోవుదును... ఇక నీ దారి నీది,; నా దారి నాది. కృష్ణునికి పదహారువేల గోపి కలు - నీవు నీకృష్ణుని కడకు పో - నేను నాకృష్ణుని కడకు

పోతాను. అందరు కృష్ణులూ ఒకటే - "ఏక మేవా ద్వితీయం బ్రహ్మ" - నీకు నీలాగూ, నాకు నాలాగూ తోచుతాడు... శఠులకు శఠుడు-లంపటులకు లంపటుడు-కపటులకు కపటి. నేను పోనా? పోనీ, కొంతసే వుండమన్నావు కనుక ఇక్కడే ఉంటాను.

చింతా—(స్వ) ఈమె యెవతెరో కాని కేవలమూ పిచ్చిదానిలాగు కనబడలేదు. పైకి మాత్ర మలాగున్నది! సర్వస్వమూ విడిచిన నేను ఈ మెను విడువలేనా? బిల్వమంగళు డొక్కడే పోలేదా? కృష్ణు డందరివాడని విన్నాను! ఈమె నింత నావద్ద నుండుమని నిర్బంధించను, ఏమైనా కానీ. నా తలవ్రాత ఎట్లుంటే అట్లవుతుంది. కాని దీనిని విడువవలెనంటే ఏడుపు వస్తూన్నది, ఎంతమాత్రమూ మనసొప్పకుంది.

పిచ్చి—చూడు-ఆ పక్షి ఒంటిగా పాడుతూ ఎలా ఎగురుతున్నాదో.

చింతా—అవగతమయ్యె నో - యమ్మ! నీ బోధ,
పాడు మనసున కేది - పాలు పోదయ్యె!
తెలియ జెప్పిన నెంత - తెలుసుకో లేదు.
సన్యాసినివి నీకు - సద్భక్తి కుదిరె.
ఐహిక వాంఛలు - సమసియుండుటను
కొఱటు పోదయ్యె హృ - త్కమలమున నాకు.
బిల్వమంగళ కుమతా - విమలోదకమున
సజ్జనసేవా మార్జన - మతని యాచింతు,

వచ్చీలు డాతడు - క్షమియింపకున్న,
కృష్ణు డెట్లాశ్రయము - కృపచేయు నాకు ?
సాధు పుదారుడు - సత్కుల సూతి
నవమాన పరిచితి - సన లేపమునను.
దొరకునా కృష్ణుని - చరణ దాస్యంబు ?
అతని వద్దకు బోయి - యంజలి జేసి
పదధూళి నొసగంగ - బతిమాలు కొందు;
క్షమియింపుమని యతని - చరణముల వ్రాల
ననురాగ జలదంబు - సమ్మృతముం గురిక,
క్షాళితంబయి హృదయ - కమలమున కనటు
నామది చేరును - నవనీత చోరు.
నీదుబోధన నాకు - వేద వాక్యంబు -
ఏకాకినై తిరుగ - గహనమున.
ఇచ్ఛయున్నదె నాకు - హృదయంబులోన
పక్షిరాణిని బోలె - పాడుచును నెగుర !
పోపొమ్ము ప్రాణేశు - పొందుమో యమ్మ
నీకు నాయెడ ప్రేమ - నిలిచియుండినను
చూచి పొమ్మొకసారి - జోహారు లిత్తు.

పిచ్చి—పోతాను. పిచ్చివాళ్ళకు నేను తల్లిని. నీవు నాకు తల్లివి. (వినుట నభినయించి) అదుగో, విను. వేణునాదములాగుంది.

చింతా—ఏదీ? ఏమీ లేదు. నీవు భ్రాంతిపడుతూ వ్నావు.

పిచ్చి—పాట-

సలలిత మురళీ-వినాదమే అది-సందేహమేలా॥స॥
కాదని మరిపించెదవా-? మరల విను సఖి-మురళి విను సఖి
లలితాలాపమదిగో-నూతన రాగంబిదో॥స॥

మళ్ళీవస్తాను-సెలవు-సెలవు. (పోవును)

చింతా—ఏడ్వకున్నారేమి ♦ యీక్షణములార!
ఎవ్వాని నొరులకై ♦ యేడ్చి యెరుగరుగ!
అలనాడు గుణఖని ♦ యా మహామహుడు
అభిమానభరమున ♦ నడవికి జనియె,
నాడైన కరుగవు ♦ పాడు మానసమ
చేతనశూన్యమా ♦ శిలవొకో నీవు?
కన్నులారా, మీకు ♦ కలదేని కరుణ
విడువుడు బాష్పము ♦ ల్వెల్లువలు గట్ట
తన్మూలమున నీహృ ♦ దయమాలిన్య
మంతయు క్షాళితం ♦ బగును సత్యంబు.
పాపాగ్నితప్తమౌ ♦ ప్రాణంబు దాన
శీతలత్వంబును ♦ చెంది సుఖియించు.
ప్రవహించునప్పుడా ♦ ప్రబలస్రోతమున
బద్దలగునేమొ నా ♦ బండహృదయంబు?
జీవితము నాకు తో ♦ చెడు శ్మశానముగ
స్వార్థాగ్ని జ్వాలల ♦ సహియించలేను.
మరుభూమి యనదగు ♦ మానసంబునను

అంకురింపగజాల • దనురాగ లతిక
స్వార్థాగ్ని శిఖలందు • పాపసమిధలను
వేల్చి నన్దహించు • వేడ్క యెవ్వరికో?
నను రాయిగా నెవ్వ • రొనరించినారో?
పతితపావన! దీన • బంధు! దయాళు!
వేధించు నీమనో • వేదనవల్ల
ప్రాణంబుపోయెడు • ప్రాణ నాథోసని
హరియింపు మీవ్యథ • అబలనే గాన.

(బిచ్చగాడు వచ్చును)

బిచ్చ—ఏమమ్మా, ఒంటిగా కూర్చొని ఏమాలో చిస్తూన్నావు? ఇంటికి పోదామా!

చింతా—నీ వెవడవు?

బిచ్చ—నేను బిచ్చగాడిని-పిచ్చిది తాళము చెవులు నాకిచ్చింది-ఇంటికి రావలెనని నీకుంటే నేను కొనిపోతాను. అదేమి కొరకొరలాడుతూన్నావు? నేను దొంగలాడడానికి నీవద్ద నేమీ లేదే?

చింతా—నే నింటికి రాను.

బిచ్చ—ఎక్కడికి పోదువు?

చింతా—కళ్లెక్కడి కీడిస్తే అక్కడికి.

బిచ్చ—నేను నిన్నెందు కడిగినానో ఆకారణము విను. నేను బృందావనము పోవలెనని నిశ్చయించుకొన్నాను. నీకు కూడా రావలెనని ఉంటే ఇద్దరమూ పోదాము. నన్ను

పోషించే భారము మాత్రము నీది.

చింతా—నాచేతిలో ఎర్రని ఏగాని లేదు. బిచ్చమెత్తి పొట్టపోసుకోవలసి ఉంటుంది.

బిచ్చ—నన్ను పోషించు భారము నీది.

చింతా—నే నింటికిపోయి సొత్తు తెస్తానని తలచు తున్నావు కాబోలు! అట్లు జరుగనేరదు. నాసొత్తుకోసము నాకు విషముపెట్టడమునకు ఆత్తరపడినవాళ్ళకి దాని నిచ్చి నాను. సొత్తెట్టివిషమో వాళ్ళెరుగరు. తాళము చెవులు నేను పారవేయడము నీవు చూడలేదా?

బిచ్చ—చూచినాను. ఉండుండు. ఈమాట విప్పు తాను, ఈ యాభరణ మెవరిది?

చింతా—అదేమో?

బిచ్చ—చక్కగా చూడు-ఇది నీది-పోల్చుకో లేదా?-పిచ్చిదాని కివ్వలేదా?

చింతా—అది నీకెట్లు వచ్చింది?

బిచ్చ—దీనిని నేను దొంగిలించ నక్కరలేకుండానే ఆపిచ్చిది నాకిచ్చింది.

చింతా—అది నీది-నాదంటావేమి?

బిచ్చ—ఇది నావద్దనుంటే నాకు జెయిలు తప్పదు. పిచ్చిదానినీ పిల్లవాళ్ళనూ మరపించుట సులభము.

చింతా—అందుకే అది నీది.

బిచ్చ—పిచ్చిది నాకు దీని నిచ్చింది కనుక ఇది నా

వన్నావు, సరే, నేను తీస్తాను; అప్పుడు నీది కాదా?

చింతా—నాకు సొమ్ములతో పనిలేదు.

బిల్వ—ఒక్కసారి దీనిని పుచ్చుకో, నేను తీసుకొంటాను.

చింతా—నీకు పిచ్చిపట్టి నట్లుంది.

బిల్వ—నేను మూర్ఖుడననీ, నీవు వివేకము కలదానవని అనుకొన్నాను...నా వృత్తాంతము చెస్తాను విను. నాకు దొంగలాడడ మలవాటు; ఊరకనుండ పోయేటట్టు లేదు. ఏదైనా దొంగలాడకపోతే నాకు నిద్రపట్టదు. ఇది నా కనుభవమే. ఏమి చేయగలను? ఎక్కడా ఏదీ దొరికకుంటే ఒక చెట్టును మనుష్యుడని భావించి యీ మూట నొక కొమ్మకు తగిలించి "ఇది నీది" అని చెప్పి, అర్ధరాత్రమున చెట్టు ఆకులు కదలనప్పుడు, అది నిద్రపోతూన్నదని భావించి తక్కుతూ తారుతూ మూట మెల్లగావిప్పి వెనక పోలీసువారు వెంబడిస్తూన్నట్లు భావించి, పరుగుపరుగున దాటిపోయి, తుప్పచాటున నక్కి కొంతసేపటికి ఆమూటను తల క్రింద పెట్టుకొని నిద్రపోతూంటాను. ఈ సరకు నీవు పుచ్చుకుంటే నీవద్దనుండి దానిని దొంగలాడి, దాని నమ్మి యీ మూటతో నీవెంటా తిరుగుతూంటాను. నీమేలుకే చెప్తూన్నాను. సుకవాసివికాయక్లేశము న కోర్వలేవు, పిచ్చిదానిలాగు నీకు శక్తికల్గితే నన్ను పోషించుదువు.

చింతా—(స్వ) పూర్వసంస్కారమా! • పోజాలవే వెం

ఎంతకాలంబునకు • అంతమొందెదవు?
తారాడుచున్నను • తరువులనడుమ
కలుషితశయ్యేయే • కన్నులను కట్టు,
తనువు నమ్మితి నట • ధనము చేకూర్ప.
జిహ్వ గోరుచునుండు • శ్లేష్మ రుచిచయము,
విసమును బంధువులు • మొసవిగావనున్న.
మలినవస్త్రంబులు • మదికి నచ్చవుగ
ఆభరణంబుల • నాశించుచుంటి
మోహజాలంబున •మున్గిపోవగను.
నెం చింతచచ్చిన • విరుగదు పులుపు,
పాపసంస్కారంబు • బాధించుచుండు.
చిరజీవిగా దీని • జేసెనో బ్రహ్మ
అంత మొందదు కల్ప • మంతమగుచుండ!

బిచ్చ—ఏ మాలోచిస్తూన్నావు. తల్లీ పిల్లడువలె తరలుదాము రా.

చింతా—ఎక్కడికి?

బిచ్చ—నీచిత్తమునకు నచ్చిన చోటికి.

చింతా—సరే-పద...(పాడుతూ పోవుదురు)

---

## — • మూడో రంగము • —

వర్తకుని యింటిలో దంపతులు.

వర్త—ప్రేయసీ, నవ్వుతూన్నా వేమి?

అహ—తల నెరిసింది, ముసలివా రవుతూన్నారని నవ్వినాను. మీా రెందుకు నవ్వుతూన్నారు?

వర్త—వయస్సు ముదిరినకొద్దీ ఈమనత్రయము హెచ్చుతూందని!

అహ—మీారైతే పెళ్ళియాడవలెనని యున్నది గాని, పిల్ల నెవ రిస్తారు? మీారేమివీగుతారు!

వర్త—అయితే ఇక్కడున్న లాభము లేదు. పోదాము పద.

అహ—ఆలాగే కానీ.

వర్త—ఎక్కడికి పోదాము?

అహ—నాకేమి తెలుసును? మీారే చెప్పండి.

వర్త—తెలియుకేమి!

పలితకేశము చెప్పు • పలుకులను వినుము;—

„వచ్చుజుమీా జముడు • వడి గొనిపోవ,

కాలంబు సమకూరె • బాలుడవు కావు,

ముడివేయు మీావింక • ముక్తి బస్త్రమును,

సంపదలన్ని నీ • సరస రాబోవు,

పోవునప్పుడు రాదు • ఘాచ్చివక్కైన,

కాలంబు గడిపెదు • కౌతుకములందు,
హరిని భజింపవీ • వస్యముల దగిలి.
బాల్యంబు జారెగా • బాడిలో నాడ—
కనక కామినులతో • గడచె యవ్వనము—
పాతగిల్లిన యాట • బాగులే దంచు
క్రొత్తయాటల నాడ • గోరుచున్నావా ?
జీవితమంతయు • జీర్ణించె గనుము—
నీ వారలందరు • నీ వెంట రారు
ఎట్లు పుట్టితివో నీ • వట్లె పోవలయు,
చిరసంగు లెవ్వరు • జేరంగ రారు,
ఒక్కడవె వచ్చితి • వొక్కడవె పొమ్ము”
అహా—ప్రాణనాథా, యిట్లు • పాడియే తలప ?
మొదట పుట్టిరి మీరు • ముక్కంటి కరుణ,
మీ వెన్క జేరితిని • మేదినీతలము ;
అగ్నిసాక్షిగ నన్ను • నందుకొను నాడె,
అర్ధదేహం బిచ్చి • యాదరించితిరి,
మీ ప్రాణసమితియు • నా ప్రాణసమితి
యొండొంట బంధించి • రొప్పుగను మీరు.
నాదు ప్రాణంబులు • నాథ మీయవిగ—
మీదాననే గావ • మిమ్మెట్లు విడుతు ?
ఇద్దర మొకసారి • యేగుదుము నాకు
మీరలే ప్రాణంబు • మీరలే యాత్మ,

మీరిలే జ్ఞానంబు • మీరె ధ్యానంబు,
వస్తువు తోడనే • వచ్చుచుండును నీవ
చంద్రిక బాయునే • చంద్రు నెవ్వడైన?
భర్తవెంటనె పోక • పతివత్నులగువారి
ప్రికృతి కర్మంబయి • పరగుచుండు.

వర్త—అట్లైన బృందావనము పోదామా?

అహ—మీచిత్తము.

వర్త—సరే- సిద్ధము చేయుము-

(గోపబాలుడు వచ్చును)

గోపా—అయ్యా, మీరు బృందావనము పోవుదురా?

అహ—నాథా! చూడండీబాలు డెంత చక్కనివా
డో- నీ వెవరి బాలుడవు నాయనా!

గోపా—నేను గోపాల బాలుడను.

వర్త—ఇక్కడి కెందుకు వచ్చినావు?

గోపా—ఇలాగే తిరుగుతూండును.

వర్త—కారణము?

గోపా—మీరు బృందావనమునకు పోవుదురా అని
అడుగ వచ్చినాను.

వర్త—అడగడ మెందుకు?

గోపా—ప్రతియింటా ఈలా గడుగుతాను.

వర్త—కారణము?

గోపా—చెప్పనా?

అహ—నీవుకూడా మావెంట వత్తువా ?

గోపా—ఆఁ.

అహ—(స్వ) ఈ బాలకుని ఎత్తుకొని ముద్దాడవలె నని యున్నది (ప్ర) మీ అమ్మ యేమంటుందో?

గోపా—నాకు తల్లీ లేదు తండ్రీ లేడు.

అహ—మీ యిల్లెక్కడ బాబూ?

గోపా—గోపకుల యింట గోవులు కాచుతూంటాను.

అహ—ఇంత చిన్నవాడవు! గోవులను కాయుగలవా.

గోపా—అహా.

అహ—నిజముగా నీ కెవ్వరూ లేరా ?

గోపా—మీరే నాకు తల్లిదండ్రులు.

అహ—అలాగా? ఏదీ పిలువు అమ్మా అని

గోపా—అమ్మా! అమ్మా!

వర్త—పాపము, దిక్కులేని పసివాడు.

గోపా—నాకు నేనే దిక్కు, ఇం కెవ్వరూ లేరు.

వర్త—మేము నేడే బృందావనము పోతాము?

గోపా—మరీ మేలే!

వర్త—నీవుకూడా బృందావనము రావడమెందుకు ?

గోపా—నా కోరిక్క ప్రాప్తించింది.

వర్త—ఏ దది ?

గో—అందువల్ల గోవులు కాయలేను, ఆడుకోలేను, బృందావనమునకు పోలేను! నన్ను బృందావనము మీతో

రానిస్తే అదేమిటో చెప్పుతాను, మీతో బృందావనము
రానిస్తారా.

వర్త—ఎందుకు?

గోపా—అతనికి కళ్ళులేవు. "హాకృష్ణా, కృష్ణా" అని
అరుస్తూ గుండెలు బాదుకొంటాడు, నేను చూడలేకున్నాను.
దేనిలో పడతాడో అని ఎప్పుడూ కాచుకొనే ఉంటాను.
కబోని-కూడే ముట్టడు. నేను బలవంతపెట్టితే కాస్తతింటాడు.

వర్త—ఆ మహాత్ముడే!

అహా—జౌనౌను- బోధకుడు-

వర్త—అతడేడీ?

గోపా—అడవిలో నున్నాడు-

వర్త—ఏమి చేస్తూండును?

గోపా—ఎప్పుడూ కృష్ణనామస్మరణె. కృష్ణా, కృష్ణా!
అని అరుస్తాడు! కృష్ణుడు ఇతని తాతముత్తాతలనాటి సేవకు
డనుకొన్నాడు కాబోలు?

వర్త—(నవ్వి)ఇంకా ఏమి చేస్తూండును?

గోప—జపమూ, సాష్టాంగ నమస్కారాలు. ఒక
ప్పుడు నేల నెత్తి కొట్టుకొంటాడు...మీవెంటా అతన్ని తీసు
కొని పోతారా?

వర్త—ఆతడు వస్తాడా?

గోపా—నే నొప్పించి తీసుకొస్తాను. బృందావనము
తీసుకొనిపోతే అక్కడ కృష్ణుడు దొరుకుతాడు-

వర్త—ఆ సంగతి నీకేలాగు తెలుసును ?

గోపా—కృష్ణనామస్మరణతప్ప అతని కింకో పనిలేదు, ఆలాటివాడు బృందావనము పోతే కృష్ణుడగపడడూ?

వర్త—బృందావనము పోతే కృష్ణుడు లభించునా !

గోపా—దొరకడేమి ? నీవు గొప్ప జ్ఞానివే!

అహ—నీకు కృష్ణుడగుపడ్డాడా ?

గోపా—నేను కృష్ణా, కృష్ణా అని తదేక ధ్యానముగా భజన చేస్తున్నానా ? నామనస్సంతా గుడ్డివానిమీదే ఉంది, అతని నామమే నేను స్మరిస్తూంటాను. నా కతడే కనిపిస్తూన్నాడు. దేనిమీద గురి ఉంటే అది లభించును.

వర్త—నీమాటలు వింటే నాచిత్త క్షేత్రమందు కొత్తగా ఆశాంకూరము మొలుస్తూంది...బృందావనము వెళ్లితే ఎవరికి దేనియందు గురిఉంటే వారికది లభిస్తుందా ?

గోపా—పోయి చూడరాదా ?...నేనాతనితో చెప్పనా?...మీరు రేవుచేరి నావపై పోతారు కదా? నే నతని నక్కడికి తీసుకొని వస్తాను. నదియొడ్డున మఱ్ఱిచెట్టుక్రింద అతడున్నాడు, అక్కడ బ్రహ్మరాక్షసున్నాదని వదంతి-ఆచెట్టు క్రిందే అతడున్నాడు ! నాకు వేళ మీరుతూన్నది, నేను పోతాను, మీరు రండి . ( పోవును )

అహ—ఈబాలుడు గోపాలునిలాగున్నాడు. అమ్మా అని పిలిచినతోడనే నాకు ఒళ్ళు పరవశమయింది.

వర్త—ఇతడు రావడము చేతనే మన కాశ కల్గింది.

ఆ మహాత్ముడు మా వెంట వస్తాడా! మరి యింట నుంచుమం చేనే ఆశ సమ్మతించలేదు. దగ్గరే ఉన్నా మనకు దర్శన మిచ్చలేదు... ఈ గోపాలు డెవడో?... నందబాలుడే కాదు గదా! భీకరారణ్య మధ్యమున చీకటిన కాచుకొని యున్నా డట! భక్తవత్సలుడైన పరమేశ్వరుడే కాబోలు!

అహ — కోరకుండానే బంధువున్నా, కోరకుండానే కొడుకూ నాకు లభించాడు, నేను కొడుకని నాను ఈయనను వెంటబెట్టుకొని బృందావనము పోదాము.

నర్త — వాళ్ళు గుసవెంటా స్తారా ఇక పడకే యున్నా న్నారు.

అహ — తప్పకుండా వస్తారు. ఆ గోపాలుడు సామాన్య గోపబాలుడు కాడు. సాక్షాత్తుగా నందనందనుడే! అన్న మాట చెప్పుతానా?

నర్త — సరే—ఇక కాలస్య మెందుకు! ఇప్పుడే పోదాము.

---

— నాల్గో రంగము —

---

బిల్వ — హా కృష్ణా! కృష్ణా! ఎక్కడున్నావు. నా కెక్కడ డవా? నీ వంతర్యామివి కావా? నా ప్రాణ మతి వ్యాకుల మైనది. ఇప్పుడైనా దర్శన మివ్వవా? . దీనదయాళూ! అనాథ నాథా! ఎక్కడున్నావు? కృష్ణా! కృష్ణా! (పడిపోవును.)

గోపా — (బిల్వ చెవిలో) కృష్ణ, కృష్ణ, కృష్ణ!

బిల్వ—(వద్దికిబోలేచి)

ఏడీ కృష్ణుండేడ కేగెను? । వేణునాదం బెట్లు వినబడె?

శ్యామలాంబరుఁ చంద్రబింబము । వరస చేసినా!

నామకోర్కెల నష్టు చెప్పకు? । నీలవర్ణుడు నిర్దయుండా?

వినరాని స్మరశరపంక్తియు । ఆర్తి యెఱుఁగదొకో?

చింతజేరియు చిక్కెడాయెను । కాలమంతా కడచుతున్నది,

కాయము౦డిన కార్యమేమిల? । అంత యస్థిరమే!

తెలుసుకొంటిని తెలివివచ్చెను । నోచితిని కొరనోములన్నియు

ఏమిచేతు నికెందుపోవుదు? । ఏదికనబడదే!

శ్రీహరిని యిట కెవరుచేర్తురు? । వీనులందున వేణునాదము

నింపి కావుము నీలవర్ణా । నీకు మ్రొక్కెదరా?

మోవి పిల్లనగ్రోవి నూదుతు । శిరమునను సిగ శేఖరింపగ

కరమునను కంకణవ్రజము । ఘల్లుఘల్లుమనగ;

చెన్నుమీరెడు చిరుతపాపడ! । వన్యసుమముల వగెన లలరగ

నన్నుబ్రోవుము నల్లనయ్యా! । నాకు దిక్కెవరు?

గోపా—నీకు దిక్కులేకేమి? నీవద్ద నేనున్నానే!

బిల్వ—తిరిగి వచ్చినావా? గోపాలా, నీవు నన్ను పావుచేయనెంచినావా? నీమాట వినబడగానే నాకు శ్రీకృష్ణుడు మరుల వచ్చును. నీ వెవడవు బాబూ! దిక్కుమాలిన నాపైని నీకు వాత్సల్యమెట్లు కలిగింది? నన్ను విడిచి పోదునాయనా? నాకు నద్గతి లేకుండా ఏలా బాధించుతావు? పట్టుకొందును పాదపద్మము । తెట్టుతీర్చెదా తాపజ్వాలలు

కట్టికుడుపుచు నున్నవే యవి ! తెల్లు నశియించునా ?
హాయ్మ్మ కృష్ణుని సరసిరమ్మా ! యమ్మ రాందును నీకు. దేహము
తెమ్మ కృష్ణుని లేకయుండిన ! నవ్వ బ్రతుకు సుమా ?
ఏల తీసెదు నాదు ప్రాణము ? ! జాలి యిసుమంతైన లేదా ?
కలదె కద సంసార మంతట ! లుగు చేటు యిటుల్.
కాటి కిక నే కాలుసాచి తిరిగిటవంతువో పాలు ముంచెదో
కాటికిని మరి గుడ్డకేనియు ! కొరబోన నిన్.
నాకు తోడుగ నిట్టియడవిని ! పాకులాడగ నేల నీవిక
నీకు తెలియును తెమ్మ కృష్ణుని ! పోకు పరిపోకల్.
ప్రేమక్షుధ దహియించుచున్నది ! నా మనోవాంఛితము తీరదు
శ్యామజనకుని గాంచగల్గిన ! కామమే యుడుగున్.

గోపా— నే నెంత మొరపెట్టినా ఆహారము నంట కున్నావు ?

బిల్వ— తింటాను కాని నీవుపో, నీవు నాదగ్గరుంటె కృష్ణుని మీదికి నాచిత్తము పోనే పోదు. నువ్వింటికి పోయిరా బాబూ !

గోపా— భోజనము చేసినావా ? నేను కాక వేరెవ్వరు నిన్నిట్లు నిర్బంధించేవాళ్లు ? బ్రహ్మ రాసిన రాతచేత ఇక్కడి కెవ్వరూ రారు.

బిల్వ—

అరుగు మిప్పుడే నీవు- గోపాలా- బాధ- ధరియింపజాలను||గో||
వల్లనయ్యా చిక్కడాయె-గో|| మనను-తల్లడిల్లు చున్నదయ్యా||గో||

కాలమెల్ల గడచిపోయె-గో॥ గోపాలబాల జూపుమయ్య॥గో॥
క్రుంకుచున్న దదిగొ పొద్దు-గో॥ద్విజు-లింక సంధ్యవార్చెదరు॥గో॥
దినము లిట్లు కడచిపోవు-గో॥ నాసి-గనుల యెప్పుడెచ్చోట॥గో॥
బ్రతుకజాలజూడకుంటె-గో॥ నేను-బ్రతుకుకుంటెజూడ నెట్లు॥గో॥
పిల్లగ్రోవి విన బడునదె-గో॥ నల్ల-గొల్లవాని గొంతురమ్ము॥గో॥
డిల్లపడెను నామనంబు-గో॥ అల్ల-నల్లనయ్య దయలేదు॥గో॥
రాధానాధ రావయ్య-గో॥ మరణ-బాధదీర్ప వేమయ్య॥గో॥

గోపా—నీవిట్లు అరుస్తూ ఉండు, నేను వింటూ ఉంటాను.

బిల్వ—నీవు బాలుడవు, ఊరక కూర్చోలేవు, పోయి ఆడుకో.

గోపా—నేను పోతే "నే నొంటరిగా నున్నాను, దిక్కు లేదని" మొరపెట్టుతావు! అడవింటే నా కడుపు చుమ్మలువారుతుంది. నన్ను విడిచి పోలేను!

బిల్వ—నీవు నన్ను సర్వవిధములా పాడుచేయ దలచుకొన్నావు. నీపై నేదో చెప్పలేని వ్యామోహము కలిగి కృష్ణుని దెనకునా బుద్ధి పోనే పోదు నిన్నుండమన లేను, పొమ్మన లేను. ఈ ప్రాణములే ఇంతచేటుకి కారణము, కనుక వీటిని పోగొట్టుకొంటే కొంతశాంతి కలుగుతుంది! ఆత్మహత్య చేసుకొంటాను.

గోపా—వద్దు, వద్దు, నాకూ మతి పోతుంది. నీవుంటేనే నాకు కాలక్షేపము జరుగుతుంది, లేకుంటే తోచదు.

బిల్వ—అన్నా ! నీ వెక్కడ నాకు ఎదురుచుక్కలాగు దాపురించినావు ! నిన్ను వదలుకో లేను ! చక్కనుంటే దావనివ్వవు !

గోపా—నీకు బృందావనము పోవలెనని లేదా ? న నువ్వు-పోదాము.

వనకాగి తోగినతు-జన కాగి తోగినతు
కనకవసనాలంకృతుని గాంతు వచట.

బిల్వ—

బృందావనమున కేగుదము-అట-కందర్పజనకుని గాంచుదము॥
ప్రేమధామమును జేరుదము-మన-కామితఫలముల గాంచుదము
యమునాపులినమున రమింతము-అనయము గోపాలుని పాడుదము
ఆలమందలను గాయుదము-వన-మాలాధరుతో నాడుదము
గోపబాలుర నటగూడుదము-మన-పావనంచయము బాయుదము॥
కృష్ణకృష్ణాయని కేకలిడుదము-మన-తృష్ణల దీర్పగ వేడుదము॥
పార్థసారథిని పాడుదము-మన-పాపములన్నిటి బడయుదము॥
తాపత్రయమును వీడుదము-భక్త దూషణపరుల త్యజించుదము
యుక్తులన్నిటి నోలాడుదము-అల-ముక్తిసతీమణి ముట్టుదము.
(పోవుదురు)

గోపా—అటు కాదు, బృందావన మిటుండి (తిప్పును)

బిల్వ—

కందు మల బృందావనంబును-అంగమున నగునందనంబు-మం
దంపదరాజీవరంజిత-సైకతస్థలముల్ !

ఝమ్మఝమ్మన తుమ్మెదలరొద-ఝిమ్మనగా మురళీరవమ్మను
కమ్మనగు పారిజాతమ్ములు-గమ్మువాసనలన్॥
గోపికాబృందంబు వనమునను-గోపబాలురు పట్టమహిషులు
తాపసేశ్వరు లెల్లగొలువగ-రాసములు సలుపన్॥
కట్టిపీతాంబరము చేతను-పట్టిమురళిని పాలసంద్రవు
పట్టి రాధయు రెండుప్రక్కల-నింపుతళుకొత్తన్॥
మాధవార్పితమైన భక్తి ర-మాధవార్చనలగ్నశక్తియు
సాధనంబులు గాన ముక్తియు-సాధ్యమగు మనకున్॥
గోపా—దా, పోదాము.

తోడి రాగము.

బృందావనవీధులగో-బృందములను గాచుచును
సుందరులగు గోపయువక-దంబంబుల సందడితో॥బృం
ధ్యానించుచు శ్రీకృష్ణుని-గానము వినుచుండి సుధా
పానము జేయుచును దేవు-నాననమును వీక్షించుచు॥బృం






# ఐదో అంకము



—: మొదటి రంగము :—

(బృందావనమున గోవర్ధనగిరి ప్రాంతము)

చింతా—లోగడ ఆత్మవంచన చేయడమునకు నీ వెన్నోవేషములు వేసినావు. శ్రీకృష్ణు కృపారసము నీపైని వర్షించడానికి కెట్టి వేషము వేయవలెనో ఎరుగుదువా? మానవులను వశపర్చుకోవడమునకు స్వర్ణాలంకారములను ధరించవలెను, చిత్తమును పాపపంకిల మొనర్చవలెను. ఇప్పుడో, వాటితో పనినరి. ఇకను విభూతిధారణమే శరణ్యము. లేకుంటే శ్రీకృష్ణుని కృపకు పాత్రురాలవు కావు - ఇట్టి సుందర పవిత్రాంగలేపన మిదివర కెరుగవు. (పులుము కొనును)

వేషభూషణముల । వేడబము చెల్లె,
కేశపాశమ ! యికను । కికురింప గలవె !
నాదు మిత్రుడవని । నన్ను వంచించి,
అందకాళ్ళకు మోపి । మంద జేసితివి,

ఉ[illegible]క్కియు నుక్కి । ఉరుమునో ధైర్య
మును విడనాడి, సతి । యను నిన్ను గొల్చు
భ్రాంతులై, వ్యామోహ । ధ్వాంతమును బడిరి.
చండుడవు నీవు వం । చకుడవు గాన,
మొదలంట ఖండింతు । సదయులను నిటు
వంచింపనేరవు । క్రించుదనమునను;
పాపంబు తొలగ గో । పాలుని కరుణ
వర్షించు, చేకూరు । హర్ష మనిశంబు,
నిన్ను ద్రుంప జను పాప । నిచయు, మటుపైని
పతితురాలని బ్రోచు । పతితపావనుఁడు.

(గోపాలుఁడు వచ్చును)

గోపా—చాల్చాలు! కేశపాశము నేల ఖండిస్తావు? వద్దు, వద్దు.

చింతా—ఎవ్వడీ బుడుతడు? వీనిని చూస్తే కళ్లు చల్లనౌతున్నవి.

గోపా—నీవేనా కృష్ణనామస్మరణ చేసినావు?... మాటాడవేమి?... నేను పోతాను.

చింతా—నీ వెవడవు?

గోపా—నీకు మర్యాద తెలియదు. "ఎవడవు నాయనా!" అనవలెను...అప్పుడు నీతో మాటలాడుతాను.

చింతా—ఎవరి బాలుడవు నాయనా! నిన్ను చూడగానే నాహృదయమున దడ పోయి మనస్సు కుదుటబడ్డది...ఒక్క

మాటాడవా?

గోపా—ఇప్పుడు నుంచు మిత్రులము-నేస్తము కట్టు దామూ?

చింతా—అమ్మయ్యో! ప్రాణాలు లేచివచ్చినవి.

గోపా—అయితే కృష్ణుని ప్రేమింతువా? నన్ను ప్రేమింతువా?

చింతా—అయ్యో! నావ్యాపారము ప్రేమవ్యాపారము, ప్రేమించుభాగ్యము నా కబ్బునా?

గోపా—కృష్ణుని ప్రేమించి నన్నుమన్నించి మాచ రించు, నీ కలవరము తీరును-నేను పోవుదునా?

చింతా—వద్దు-నీవు పోవద్దు, నా మనవి వినుము.

గోపా—బృందావనము చేరినాము-ఇప్పుడు చెప్పు— కృష్ణుని ప్రేమిస్తావా? నన్నా?

చింతా—ఇద్దరినీ ప్రేమిస్తాను.

గోపా—అది పొసగదు. ఎవరినో ఒకరినే నమ్ముకో- నన్ను నమ్ముమని నిర్బంధించను-నీవే ఆలోచించుకో (బిచ్చ గాడు వచ్చును)

బిచ్చ—అహా! ఏమి మోహనగోపాలమూర్తి! ఇతడు వ్రజబాలుడేమో!

గోపా—మనము నేస్తుల మౌదామా?

బిచ్చ—ఆలాగే (మాట నద్దును)

గోపా—అయితే, దొంగా! మాట దాస్తావేమి!

బిచ్చ—అబ్బే! ఇందులో ఏమీ లేదు...(తడబడును)

గోపా—లేకుంటే అది యీలాగు తే. ఆ ముడి ఎందుకు?

బిచ్చ—ఓహో! ఇది బృందావనము. (మూట పార వేయును)

చింతా—ఏమి నాయనా, నాతో నేస్తముకట్టి ఇంకొ కరితో మైత్రి చేస్తావా?

గోపా—ఏమీ? కూడదా?

చింతా—అలాగైతే మనకు మైత్రి పొసగదు.

గోపా—పోనీ, నన్ను పిలిచినప్పుడే వస్తాను! (పోబోవును)

చింతా—ఆఁ ఆఁ. ఉండుండు.

గోపా—ఎందుకూ! మనకు పొసగ దన్నావే! (పోవును)

బిచ్చ—బాబూ, బాబూ, కొంచె ముండు.

చింతా—అయ్యో! పోయెనే! నా కాకలి వేస్తూంది.

బిచ్చ—ఏమైనా తెచ్చిపెట్టనా?-అదిగో పిచ్చిది-

(పిచ్చిది వచ్చును)

పిచ్చి—తెలిసింది-శ్రీకృష్ణుడు నన్ను బ్రోచును,నాతల్లిని చూడగానే నాకు ధైర్యము చిక్కింది. కాత్యాయని నారాధించి గోపికలు శ్రీకృష్ణుని పొందినలాగు నే నీమె నాశ్రయించి నాకోర్కె సఫలము చేసుకుంటాను. మాఅమ్మ ఎవరితో

మాట్లాడింది? అధిక తేజోవంతుడైన ఆసన్యాసి ఎవరు?

బిల్వ—ఈమె యిచ్చటికి వచ్చింది గనుక నా కాశ్రయము దొరికింది. (పిచ్చిదీ శిష్యులూ వెంటరా సోమగిరి వచ్చును.)

పిచ్చి—మన కిక్క డేమిపని? పోదమా? ఇల్లు విడచి చాలకాలమయింది!

సోమ—ఔను, పోవచ్చును.

పిచ్చి—నా మానసమున నేదో యుండి ఇన్నాళ్ళూ నన్ను తిప్పింది. ఎంత వయాన మయింది! అడవులన్నీ తిరిగి తిరిగి దిమ్మరి నైనాను.

చింతా—అమ్మా, కరుణామయీ, నాతో నొక మాటాడవా?

పిచ్చి—తల్లిని నేను కాను. ఇతని నఖుగు.

చింతా—నీకొరకెంతో వెదకినాను, ఎందరినో అడిగినాను. నా మనోవాంఛాఫలసిద్ధి అయ్యేటట్టు నన్నాశీర్వదించు. (సోమగిరితో) మహాత్మా, నాకు తరణోపాయ మేది? నేను దౌర్భాగ్యరాలను. రాధావల్లభుడు నా బాధల తొలగించునా?

సోమ—అతడు పతితపావనుడు, తప్పకుండా నిన్ను దరిజేరుస్తాడు, చింతించకు.

చింతా—పాషాణనిర్మితము । దోషకలితంబును
నీరవ మరుభూమి । నీరవర్జితము
నామనం బటనెట్లు । ప్రేమ జనించును?

దను- ఏడువకు!

బిచ్చ—అమ్మా! నీకొడుకును మరచినావా?

పిచ్చి—లేదు లేదు- నీవూ నావెంట రా.

బిచ్చ—నాకేదేనా తరణోపాయ ముందా?

సోమ—నీవు మంచివాడవు, ఈబృందావన మానంద ధామము. ఇక్క డెవ్వరూ దుఃఖించ నవసరము లేదు.

బిచ్చ—నేను దొంగనే!

సోమ—మరీ మంచిది! నవనీతచోరుని దొంగిలించు.

బిచ్చ— గురుసర్వా! శక్తియుంటే అందుకు తగిన వాడనే!

సోమ—నీసుతుని వెంటబెట్టుకొని రా, నేను గోవర్ధన గిరికి ప్రదక్షిణము చేసి వస్తాను.

పిచ్చి—సరే, వీరి నిద్దరినీ అక్కడ చేర్చుతాను-ఇంకా లస్య మెందుకు? మనకు [illegible] సమావేశ మెక్కడవుతుందో?
( పోవును. )



—• మూడో రంగము •—

( వనములో బిల్వమంగళుడు )

బిల్వ—ఈగోపాలుడు నన్ను పాడుచేసినాడు! ఎన్ని విధముల యత్నించినా మరువ రాకున్నాడు. వీని మోహమున తగులుకొన్న నాకు శ్రీకృష్ణదర్శనము ప్రాప్తించదు. ఈ సాయంకాలము దాకా వేచి యుంటాను. ఈలోపున చిత్త స్థైర్య మలవడిందా సరే. లేకుంటే ఆత్మహత్య కావించుకొంటాను. అన్నా! నామనఃఫలకమున ఈగోపాలు డేలాగు దావురించినాడు! వీడే నా చేటుపాలకు మూలకారకుడు. హా! కృష్ణా! నన్నేల మరపిస్తున్నావు? నన్ను భ్రష్టుని చేసెద వేమి? ఈగోపాలుని నామానసమందు అచ్చొత్తి నీవు కనుమొరగితివా? వీడిని వదల్చుకొని నేటికి వారమయింది, కాని వానిరూపము నన్ను వదలకున్నది-అనుక్షణమూ వాడే నామనోవీథిని కాపురముండి నీకు చోటియ్యకున్నాడా? ఆతడుంటే నేనెట్లు రాగలనని నీవు రాకున్నావా? నేనేమి చేయుదును? ఈభ్రష్టుడు నాకేమి మందుపెట్టినాడో కాని నేనతని మరువజాలకున్నాను. నా చిత్త మాతనియందే లగ్నమయింది-ఇరువైరోజులు భుజించ కుంటే ప్రాణములు పోవునని వింటిని-అందుచేత నిరాహారుడనై నిన్నే ధ్యానించుచున్నాను. ప్రాణములు పోకున్నవి. ఈగోపాలుడు నన్ను చావనీయకున్నాడు! నిన్ను ధ్యానిస్తూ

ఇక్కడే కూర్చుంటాను- వచ్చినా సరే-(ధ్యానించి) గోపాలా! గోపాలా! నేను శ్రీకృష్ణుని ధ్యానిస్తూంటే నీవు కనబడుతా వేమి?--ఇంకోసారి యత్నించెదను కన్నులారా, చెవులారా, మీరు వీని వ్యామోహము విడువండి. కళ్ళంటే పోడుచుకొ న్నాను గాని చెవు లేలాగు మూయగలను? కృష్ణుని రూపము చూడలేకపోయినా, ఆతని మాటలైన వింటాను. కళ్ళులేని లోప మిప్పుడు కనబడుతూంది . మూఢమానసమా, ఈబండ గోపాలుని మరచి నందగోపాలుని ధ్యానించు. గోపాలా! గోపాలా! (ధ్యానించును.)

( గోపాలుడు వచ్చును. )

గోపా—నీ విక్కడా దాగుకొన్నావు? ఏడు రోజుల నుండీ నీకోసము ఊరంతా వెతకుతూన్నాను.

బిల్వ—నన్ను నీవు వెదకడమెందుకు?

గోపా—నీవు దిక్కులేని వాడవు-అనాధలను చూస్తే నామనస్సు కరుగుతుంది.

బిల్వ—దిక్కు లేనివాళ్ళ మీాద నీకు అనురాగ మెందుకు?

గోపా—అది నా నైజము.

బిల్వ—(స్వ) మూఢమానసమా! ఈ గోపాలు డనాధనాధుడైన నందగోపాలుడే కాబోలు! (ప్ర) గోపాలా! గోపాలా! దయజూపి నన్ను దరిజేర్చవా?

గోపా—నీదగ్గర రాను-నన్ను పట్టుకొంటావు!

బిల్వ—లేదులేదు-దగ్గర రా!

గోపా—పాపము! వారము రోజులనుండి నీటిచుక్కై న తాగలేదు, ఇదిగో పాలు, ఎండలో నున్నావు, నీడకు రా.

బిల్వ—నాకు కనబడదు, నాచెయ్యి పట్టుకో.

గోపా—రా. (చేతి నందిచ్చును)

బిల్వ—(గట్టిగా పట్టుకొని) ఇక నిన్ను విడువను-ఇన్నాళ్ళూ నన్ను మరపించినావు.

గోపా—నాచెయ్యి నొప్పి పెట్టుతూన్నది! వదలు. (పారిపోవును)

బిల్వ—మరపించి పోవుట ॥ మానుషమంటే నీకు?
ఏడ్పింతు దయచూడ ॥ కిదియేటి మాద్రి?
తప్పించుకొనిపోవ ॥ గొప్పయని యెంచితో?
నాదుహృదయంబునను ॥ నాదుకొను భక్తి
పోగొట్టయత్నించు ॥ పొగడుదు నిన్ను. నా
చేయిపీడిననేమి? ॥ చేతమిదె నిన్ను
గట్టిగాబంధించె ॥ పట్టు నడలగబోదు
కన్నులేమిని నిన్ను ॥ గందు ననజాల.
మనమున నిల్పి నే ॥ మననంబు చేతును,
ఉందునో నీరూప ॥ మూడునో గాంతు.

గోపా—కో! ఏదీ నన్నుముట్టుకో-(చుట్టూ తిప్పును)

బిల్వ—మహాత్మా! నిన్ను ముట్టుకొనడాని కెంత పుణ్యముచేసి యుండవలెను. నీవుకృపజూడకున్న నాబోటివాడి

కడి సాధ్యమవునా? కర్మపరిపక్వము కావలదా?

గోపా—ఇదే నీకు జ్ఞాననేత్ర మిచ్చినాను. నా రూపము కన్నార గాంచుము.

బిల్వ—ఆహా! ధన్యోస్మి! ధన్యోస్మి! చూడదగినది చూచినాను-నాతపస్సు ఫలించినది.

నవీనజలధర శ్యామసుందర । మదనమోహనరూప
నయనఖంజనా హృదయరంజన । రాధావల్లభ గోపా।
ధీరనర్తనా నూపురగుంజన । మురళీమోహన తాన
కుసుమభూషణా ఆర్తపోషణా । శరణు గోపికాప్రాణ
శ్రీపదపంకజ నీదు పదరజము । దయజేసియు కరుణాపరా
నిన్నే నమ్మితి నిన్నుభజించితి । నీలో నన్నుక చేర్పరా।

గోపా—ఎవరో వస్తూన్నారు. నేను దాగుకొంటాను. వారు నీకోసము వస్తూన్నట్లుంది, నీవిక్కడే ఉండు. వాళ్ళు వెళ్ళిన తర్వాత నేను వస్తాను.

బిల్వ—అమ్మయ్యో? నీవు వెళ్ళకు. నాకింకెవ్వరితోనూ సంబంధము లేదు.

గోపా—ఏమోకాని వాళ్ళేవస్తూ వస్తూన్నారు. వారిని చూస్తే నాకూ ఏమ్మ వస్తుంది. అందుకే నే నిక్కడుండను.

బిల్వ—అహా! నీకేమప్పు తెప్పించునంతటివా క్కింత ధన్యులో!

గోపా—ఇప్పుడే తెలుస్తుంది గా! ఇక్కడే ఉండు.

నే నీ చెట్టుచాటునే ఉంటాను. అదిగో వస్తూన్నారు! (పోవును)

( వర్తకుడూ భార్యా వత్తురు )

వర్త—ప్రియా, ఆ గోపాలు డెవడు? బృందావనమున కృష్ణుడు లభించునని చెప్పి మాయమైనాడు!

అహ—అదేమో కాని, ఆబాలుడు న"న్నమ్మా" అని పిలుస్తే, నాకు కృష్ణు డక్కరలేదు.

(తెరలో)—అమ్మా !

అహ—నాయనా, ఎక్కడ నున్నావు? ఇటురా, ఇటు

(తెరలో)— నే నీ చెట్టుచాటున నున్నాను-మీారు కూర్చోండి.

బిల్వ—ఆహా! ఎట్టి దివ్యసుందరవిగ్రహము చూచినాను! గోపాలా! గోపాలా!

( చింతామణి, పిచ్చిది, బిచ్చగాడూ వత్తురు )

పిచ్చి—నీవు ముందరపో అమ్మా! అల్లుని యెదుటకి నే నేలాగు రావడము! నే నిక్కడ కూర్చుంటాను—అయ్యా నీవూ కూర్చో. ఇది పుచ్చుకో. (బంగారువస్తువు లిచ్చును.)

బిచ్చ—ఇది నా కెందు కమ్మా?

పిచ్చి— అక్కర లేదా? ఇలాగే పరులసొమ్ము ఆశించకు!

బిచ్చ—అలాగే.

(సోమగిరి శిష్యుడూ వత్తురు)

సోమ— సంసారాంబునిధిమగ్నులకు వైరాగ్యభిక్ష

న్నాసగడమున కీ వేశ్యయూ ఆ లంపటుడున్నూ నిమిత్తమాత్రులు, వీరిద్దరి కృపచేత మనకు నేడు శ్రీ కృష్ణుని దర్శనయోగము కలుగు తుంది.

శిష్యు—గురుదేవా ? నే నజ్ఞానుడను - మీా రిప్పుడు చెప్పిన వేశ్యకూ, ఆ లంపటునికీ కోటి ప్రణామములు. శ్రీ కృష్ణుని దర్శనమునకు ఫలమేమి ?

సోమ—వత్సా ! శ్రీ కృష్ణదర్శనమునకు శ్రీ కృష్ణ దర్శనమే ఫలము. దానికన్న నెక్కువఫల మేమున్నది ?

చింతా—అమ్మయ్యో !

కష్టములు గట్టెక్కె । నిష్టములు ఫలియించె
సన్యాసివర నీదు । సందర్శనమున.
చల్లనాయెను కళ్లు । శాంతించె మానసము
నా దేవ జూచి విను । నాదు విన్నపము.
చరణదాసిని నీదు । దరి జేర్పగారాదె ?
సదయ హృదయుడ వీవు । స్పర్ధ నీకేల ?
నీకు తగునా యింత । నిష్ఠురము నాదేవా?
ఓ దయాంబుధి చెప్పు । నీదు నాశ్రయము !
చందమామ వెంట । చంద్రిక బోవనా,
మేఘమాల వెంట-మించు బోవు.
కృపజూపవేని నే । నిపుడె త్యజింతును
ప్రాణముల నీయెడ । పాతకము బట్టు.

స్త్రీహత్యనాక్రమించి చిన నూర్ధ్వగతులున్నె?
దక్కవు నీకు నట్టి దయజూడకున్న.
నీవు క్షమించిన నేవత్తు త్రిదివంబు,
ఇద్దర మట నుండ మీక్షణము లట్లు
పరితాప భరమున పాపము ల్కడచనె,
కృపచేసి ... ముకృష్ణ కళ్లారన్॥

బిల్వ—అహో! శ్రీకృష్ణనామ మెవ రుచ్చరించినారు! (చింతామణిని పోల్చి) ఓహో! ఏమిది! నాగురువు! ప్రేమశిక్షాదాతా! విశ్వమోహినీ! నన్ను కరుణింపుము. (నమస్కరించును.)

చింతా—ప్రభూ! ఇంకా వంచనయేనా? - ప్రేమమయా! యోగిచర్యా! ప్రేమస్వరూపుడగు భగవంతుడు నీవద్ద నున్నాడు. నిన్నేమడిగిన నది యిచ్చెదవని నాగురువు నా కుపదేశించెను నీకృష్ణుని నాకిమ్ము - ఇవ్వడమున కిష్టము లేకుంటే నీవద్దనే నిల్చుకొని నాకొక్కసారి చూపించుము. పాపాత్మురాల—పతితపావను సందర్శనము నాకు కల్గించుము.

బిల్వ—కృష్ణునియందే నీచిత్తము జొత్తిల్లిన కాని నీకు దర్శనము కాదు. అది సాధకమున చేకూరును కాని ఒకరిస్తే లభించేది కాదు.

చింతా—నా హృదయము ప్రేమ శూన్య పాషాణము. యోగివరేణ్యా! శ్రీకృష్ణుడు నాకు చిక్కు టెలాగు?

బిల్వ—భక్తిచే సకలమూ సిద్ధించ గలదు.

—:పాట:—

తరింపన్-కోర్కె కలదేనిన్-తలపుమీ-కృష్ణనామాళిన్।
నిరంతర-మాతనిన్-కరుణానిరతునిన్-నిల్పుమా మదిని॥త॥
మదింపకు భాగ్యమున్ ధనమున్ ఘనంబౌ-మానముం జూచి
ఎదంగని న్యాయనిర్ణేత పరాత్పరు-డేలు నిన్నంచున్॥త॥
శరీరదుర్గమం దకటా చరింతురు-శత్రులారుగురు
పరాకును మాని భవవార్ధిన్ గడుపుమా-భక్తియను నౌకన్॥

చింతా—యోగివరా! నీవు కృష్ణుని జూపుదువని నా గురు వుపదేశించెను, ఏదీ చూపు మాకృష్ణుని-లేకున్న ఆప్త వాక్య మబద్ధమవును!

(తెఱలో) నన్ను మరచినారా?

చింతా—చూచినానా నిన్ను? ఆగోపాలుండే నన్ను ప్రేమించెను. నేను ప్రేమశూన్యను. గోపాలా - ఆడదానను అజ్ఞానాలను, నాపై కోపమా? నీకు నాపైని పంతమా? దయచేసి దర్శనమియ్యవా!

(తెఱలో) ఇక్కడికి రా, నాచెంతను.

(తెర ఎత్తితే రాధా కృష్ణులు ప్రత్యక్ష మవుదురు)

అందరు—జే రాధావల్లభా! జే జే రాధాకృష్ణా జే! జే! జే!

వర్త—ఆహా! కలియుగమున వైకుంఠము!

అహ—ఏరి నాయనా ఒక్కసారి "అమ్మా" అనుము.

గోపా—అమ్మా! అమ్మా!

చింతా—హృదయమందలి దప్పి తీరునట్లు కృష్ణదర్శన సుధా రసము గ్రోలుము. భక్తులారా!—భాగవతోత్తములారా! జన్మ సార్థక మవును.

శిష్యు—గురువర్యా ! శ్రీకృష్ణ దర్శనమునకు ఫలము శ్రీకృష్ణదర్శనమేకదా !

సోమ—వత్సా, నిరతిశయానంద వైభవము నొసంగజాలున దింకొకటి లేదు-దాని ననుభవించుటే ఉత్కృష్టఫలము.

బిచ్చ—నవనీతచోరా, నిన్ను దొంగిలించగల్గితే నా చౌర్యవిద్య సార్థక మవుతుంది.

పిచ్చి—నా కేడ్పు వస్తూన్నది. నానాథుడు లేడు, నే నొక్కర్తె నైనాను. అతని వెతకి తెచ్చి శ్రీకృష్ణుని చూపుతాను.

సోమ—అమ్మా ! మనకర్మ ఇంకా పరిపక్వము కాలేదు. కొంతవరకూ ప్రారబ్ధ మనుభవించవలెను. పోదాముపద.

బిల్వ—శ్రీగురుచరణారవిందములకు నమస్కారము! భక్తబృందమునకు ప్రణామము ! మీయందరి కృపచేత గోపీవల్లభుని దర్శనము ప్రాప్తించినది, తరించినాను.

సహనా వవతు, సహ నౌభునక్తు, సహవీర్యం కరవావహై,
తేజస్వినా వధీత మస్తు-మా విద్విషావహై-
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

సమాప్తము.

---